శ్రీః

మహాకవి కాళిదాస ప్రణీత

# రఘువంశము

## దశమ సర్గము




వ్యాఖ్యాత:

డాక్టర్ పాటిబండ మాధవ శర్మ

ఆంధ్రశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము

*

ప్రకాశకులు:

శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు

చిక్కడపల్లి — హైదరాబాదు — 20.

# విన్నపము

సంస్కృత భాషా సాహిత్యముల యధ్యయనము యొక్క విలువను, ఆవశ్యకమును ప్రజలు, ప్రభుత్వము, విద్యాధి కారులు, విద్యార్థులు ఇప్పుడిప్పుడు గుర్తించుచున్నారు. ఆ భాష యందలి కావ్యములను, నాటకములను చదివి యానం దింపవలెనని పలువురు ఉత్సాహ పడుచున్నారు. అయినను కావ్య నాటకములు స్వయముగా చదువుకొని యర్థము చేసి కొని యానందించుటకు తగినంత భాషాజ్ఞానమును సంపా దించుటకు పలువురకు అవకాశము లభింపదు. అట్టివారికి ఉత్తమ సంస్కృత నాటకములను ఆంధ్రలిపిలో, ఆంధ్రాను వాద, వ్యాఖ్యానములతో అచ్చువేసి అందజేయుట ఉచితము, అవసరము అని తోచి మేము ఆ కార్యమునకు పూనుకొం టిమి.

సంస్కృత కావ్యములందలి కొన్ని సర్గములను గూడ సంస్కృత సాహిత్యాభిమానులయిన యాంధ్రపాఠకులకు అందుబాటులోనికి దెచ్చుటకును గొంత ప్రయత్నము చేయు చున్నాము. పదవిభాగ, అన్వయ, ప్రతిపదార్థ, తాత్ప ర్యములతో పాటు కొంత వ్యాఖ్యానము కూడ చేర్చి రఘు వంశాది కావ్యములందలి సర్గములను ప్రకటింప వలెనని పూనుకొంటిమి.

పంచతంత్రము, దశకుమార చరిత్రము, హర్షచరిత్రము మున్నగు గద్య గ్రంథములను ఆంధ్రానువాద సహితముగా ప్రచురించుటకును పూనుకొని యున్నాము.

విశ్వవిద్యాలయము నిర్వహించు పరీక్షలకు చదువుకొను విద్యార్థుల ప్రయోజనములను గూఢ దృష్టియం దుంచుకొని ఈ ప్రచురణములు సిద్ధము చేయబడుచున్నవి. వీనిని అధ్యాపకులు, సంస్కృత భాషా సాహిత్యాభిమానులైన యాంధ్ర రసజ్ఞులు ఆదరింతురనియు, మా యుద్యమమును ప్రోత్సహింతురనియు ఆశించుచున్నాము.

మా ప్రయత్నము యొక్క సాఫల్యమునకు ఆంధ్ర రసజ్ఞులే ప్రమాణము.

—ప్ర కా శ కు లు

*

# విషయ సంగ్రహము

---

దేవేంద్రునితో సమానమైన తేజము, వైభవము గల దశరథమహారాజు (ముని శాపానంతరము) రాజ్య పరిపాలన చేయుచుండగా కొంచెము తక్కువగా పదివేల సంవత్సరములు గడచెను. కాని పితౄణ విముక్తికి, దుఃఖాంధకార నాశమునకు గారణమైన పుత్రు డనుపేరి జ్యోతి మాత్రము ఆయనకు ప్రాప్తము కాలేదు. సముద్రమునుండి రత్నము లుత్పన్నములగుటకు మథనము అవసరమైనట్లు ఆ మహారాజునుండి పుత్రు లుత్పన్నులగుటకు ఏదో మహాకారణము అవసరమై యుండెను. ఆ కారణముకొఱకు దశరథుడు నిరీక్షించుచుండెను. పుత్ర కాంక్షియైన ఆ రాజునకు పుత్రోత్పత్తి గలిగించుటకు సమర్థమైన పుత్రకామేష్టిని ప్రవర్తింపజేయుటకు మహాత్ములైన ఋశ్యశృంగాదులు పూనుకొనిరి. మహిమాన్వితులైన మహర్షులు ఋత్విక్కులుగా పుత్రకామేష్టి ఆరంభమయ్యెను.

## దేవతలు విష్ణువును దర్శించుట

ఆ సమయమున గ్రీష్మాతప పీడితులైన జనులు ఛాయావృక్షము నాశ్రయించినట్లు రావణ పీడితులైన దేవతలు శ్రీహరి నాశ్రయింపబోయిరి. వారు క్షీరసాగరమును జేరునప్పటికి ఆదిపురుషుడును యోగనిద్రనుండి మేల్కాంచి యుండెను. కాల విలంబనము లేకుండుటయే కార్యసిద్ధికి లక్షణముగదా. ఆదిశేషుని శరీర మనెడు సింహాసనమున గూర్చుండి, ఆతని పడగలందలి మణుల కాంతులచే ప్రకాశింపజేయబడుచున్న విగ్రహము గల శ్రీహరిని దేవతలు దర్శించిరి. లక్ష్మీదేవి పద్మపీఠమున గూర్చుండి, తన మొలనూలిపై పట్టుబట్టను పరచి, దానిపై పల్లవములవంటి హస్తముల నుంచి ఆ దేవుని పాదములను ఆ హస్తములందుంచుకొని యుండెను. వికసించిన తెల్లదామరలవంటి కన్నులతో, లేయెండవంటి కాంచనాంబరముతో ఆ దేవుడు శరదారంభ దివసమువలె సుఖదర్శనుడై యుండెను. లక్ష్మీదేవికి విలాస దర్పణము, సముద్ర జలసారమును నైన కౌస్తుభ మను మణిని ఆయన తన వక్షమున ధరించి యుండెను. ఆ కౌస్తుభ కాంతులు ప్రసరించి భృగు మహర్షి పాదతాడనమున గలిగిన శ్రీవత్స మనెడు హరి వక్షస్థలమందలి మచ్చ

కూడ మిక్కిలి ప్రకాశించుచుండెను. నానాభరణ భూషితములై శాఖలవలె నున్న బాహువులుగల ఆ శ్రీహరి సముద్రమున ఆవిర్భవించిన రెండవ కల్పవృక్షమా యన్నట్లుండెను. దానవ స్త్రీల చెక్కిళ్ళయందలి మదలేఖలను తుడిచివేయు ఆ దేవుని శంఖచక్రాద్యాయుధములు చైతన్యవంతములై జయజయ ధ్వానములు చేయుచుండెను. ఆదిశేషునితోడి విరోధమును విడిచి, వజ్రాయుధవ్రణ చిహ్నములు గల గరుత్మంతుడు ప్రాంజలియై వినయముతో ఆ దేవుని చెంత నిల్చియుండెను. యోగనిద్రావసానమున నిర్మలములై, పావనములైన వీక్షణములతో ఆ దేవుడు సుఖనిద్రనుగూర్చి ప్రశ్నింప వచ్చియున్న భృగ్వాది మహర్షులను అనుగ్రహించుచుండెను.

దేవతలు ఆ యాదిపురుషుని దర్శించి, ప్రణమిల్లి స్తోత్రార్హమైన ఆయన తత్వమును స్తుతింప నారంభించిరి.

## దేవతలు విష్ణువును స్తుతించుట

"ఆదియందు విశ్వమును సృజించినవాడవు, తదనంతరము విశ్వమును భరించువాడవు, కడపట విశ్వమును సంహరించువాడవు నై యిట్లు త్రివిధమైన స్వరూపము గల నీకు నమస్కారము. ఒకే రుచిగల వర్షజలము ఆ యా ప్రదేశములందు పడి లవణత్వాదులైన రుచి భేదములను ఎట్లు పొందునో అట్లే నీవును ఏకరూపుడవయ్యు సత్వాది గుణముల నాశ్రయించి రూపభేదములు పొందుదువు. ఏకరూపుడవైన నీవు ఉపాధి భేదమువలన రూపభేదములను పొందుచున్నావు. రాగద్రవ్య సంపర్కమువలన స్ఫటికమునకు గలిగిన నానావర్ణత్వ మెట్టిదో నీ నానారూపత్వము అట్టిది. నీవు ఇంతవాడవని చెప్ప శక్యముగానివాడవు. లోకమునకు పరిమితి గలిగించినవాడవు. కోరికలు లేనివాడవు. కోరికల నిచ్చువాడవు. జయింపబడనివాడవు. సర్వము జయించు స్వభావము గలవాడవు. మిక్కిలి సూక్ష్మరూపుడవు. స్థూలమైన జగత్తునకు గారణమైనవాడవు.

సర్వాంతర్యామివయ్యు సమీపస్థుడవు కావనియు, కోరికలు లేనివాడవయ్యు తపస్సు చేయుచుందువనియు, దయాళువయ్యు దుఃఖస్పర్శ లేనివాడవనియు విద్వాంసులు నిన్నుగూర్చి పలుకుదురు. నీవు సర్వము నెఱుంగుదువు గాని ఎవ్వరికి నెఱుంగబడవు. నీవు సర్వమునకు జన్మకారణమవు గాని నీ జన్మకు గారణము

లేదు. నీవు సర్వమునకు ఈశ్వరుడవు గాని నీకు ఈశ్వరుడు లేడు. నీవు ఒక్కడవే కాని నానారూపములు ధరింతువు. నీవు సప్తవిధములయిన సామములచే కీర్తింపబడువాడవని, సప్తసాగరములందు శయనించువాడవని, సప్తార్చియైన యగ్నియే ముఖముగా గలవాడవని, సప్తలోకములకు ఆశ్రయమైనవాడవని విద్వాంసులు చెప్పుదురు.

చతుర్విధములైన పురుషార్థముల జ్ఞానము, చతుర్యుగములుగా విభక్తమైన కాలము, చతుర్వర్ణములు ప్రధానముగా గల లోకము – ఈ సర్వము చతుర్ముఖస్వరూపుడవైన నీవల్లనే జన్మించినది. యోగాభ్యాసముచే నిగ్రహింపబడిన మనస్సుతో యోగీశ్వరులు తమ హృదయమునందే యున్న నిన్ను మోక్షార్థులై యన్వేషింతురు. జన్మ లేనివాడవయ్యు జన్మ గ్రహించువాడవు. నిష్కాముడవయ్యు శత్రువులను సంహరించువాడవు, నిద్రితుడవయ్యు జాగృతుడవు నైన నీయొక్క తత్వము నెవ్వ రెఱుంగగలరు ?

శబ్దము మున్నగు ఇంద్రియార్థముల ననుభవించుటకు, చేయ శక్యముగాని తపస్సు చేయుటకు, ప్రజలను పాలించుటకు, తటస్థభావముతో వర్తించుటకు నీవు సమర్థుడగుచున్నావు. వేరు వేరు గతులు గలవయ్యు పుణ్యహేతువులైన గంగానది ప్రవాహములన్నియు సముద్రమునందే పడుచున్నట్లుగా శాస్త్రములచే బహుధా భిన్నములయ్యు పురుషార్థసిద్ధికి సాధనములైన మార్గములన్నియు నీయందే ప్రవేశించుచున్నవి. నీయందు సమర్పింపబడిన చిత్తముగలవారు, నీయందు సన్న్యసింపబడిన కర్మలుగలవారు నైన విరక్తులు పునరావృత్తి రహితస్థితి నందుటకు నీవే యాధారము. ప్రత్యక్ష ప్రమాణముచే నెఱుంగ దగిన పృథివి మున్నగు నీమహత్తు ఇంతటిదని చెప్పశక్యము గానిది. శబ్దానుమానప్రమాణ గమ్యుడవైన నీ సంగతి వేఱుగా చెప్పవలసిన దేమున్నది.

కేవలము నిన్ను స్మరించినంత మాత్రముననే పురుషుని పవిత్రునిగావింతువు దర్శన స్పర్శనాదులవల్ల ఇంకెంత పవిత్రుని గావింతువోకదా ! సముద్రముయొక్క రత్నములవలె, సూర్యునియొక్క కిరణములవలె అగమ్యములైన నీయొక్క ప్రవర్తనములు పొగడ్తలనుగూడ మించిపోవుచున్నవి. నీకు పొందబడనిది, పొంద దగినది ఏదియులేదు. ఐనను కేవలము లోకము ననుగ్రహించు

టకే నీవు జన్మ కర్మలను అవలంబించుచున్నావు. నీయొక్క మహిమను వర్ణించి వాక్కు ఉపసంహరింపబడుచున్న దన్నచో దానికి మా యలసత్వము, అశక్తత్వము కారణములుగాని నీ గుణముల పరిమితత్వము మాత్రముకాదు."

## విష్ణువు దేవతల కభయ మిచ్చుట

ఈ విధముగా బలికి దేవతలు ఆ యధోక్షజుని ప్రసన్నుని గావించిరి. ఇది యింతయు పరమేష్ఠి విషయమున భూతార్థ కథనమే కాని అభూత కల్పనము కాదుగదా. అంతట కుశల ప్రశ్నముచే తన ప్రీతిని వ్యక్తముచేసిన ఆ దేవునకు దేవతలు ప్రళయము లేకయే పొంగుచున్న రావణుడనెడు సముద్రమువల్ల తమకు గలిగిన భయమును గూర్చి విన్నవించిరి. అప్పుడు చెలియలికట్ట సమీపమందున్న పర్వత గుహలయందు ప్రతిధ్వనించు కంఠముతో, తిరస్కరింపబడిన సాగర ఘోషము గలవాడై భగవంతుడు పలుక దొడగెను. పురాతనుడు సర్వజ్ఞుడునైన ఆ విష్ణుదేవుని కంఠతాల్వాది వర్ణోద్భవ స్థానములందు చక్కగా ఉచ్చరింపబడినదై సాధుత్వము పొందిన వాగ్దేవి నిశ్చయముగా కృతార్థురాలయ్యెను. ఆ దేవుని వదనమునుండి బయటికి ప్రసరించి ఆయన దంత కాంతులతో కూడియున్న సరస్వతీదేవి ఆయన పాదములనుండి వెడలి యూర్ధ్వ ముఖముగా ప్రసరించుచున్న ఆకాశ గంగయా యన్నట్లుండెను. ఆయన యిట్లనెను :

" ఓ దేవతలారా! మీ యొక్క మహిమయు, పురుషకారమును ఆ రావణునిచేత మానవుల సత్వ రజోగుణములు తమోగుణముచే ఆక్రమింపబడినట్లుగా ఆక్రమింపబడినవని నేనెఱుంగుదును. కోరకుండగనే సంక్రమించిన పాపముచేత సజ్జనుని హృదయమువలె, రావణునిచే భువనత్రయము తపింపజేయబడుచున్నదనియు నాకు దెలియును. మరేమనగా ఇంద్రుడు నేనును ఏక కార్య ప్రవణులమే కనుక చేయవలసిన పనులందు తోడ్పడుమని ఆయన నన్ను ప్రార్థింప నక్కరలేదు. వాయువు స్వయముగనే అగ్నికి సారథ్యము చేయును గదా. ఆ రావణుడు తొమ్మిది శిరస్సులను తానే చంద్రహాసముతో ఖండించుకొని పదియవ శిరస్సును నా చక్రము కొఱకు నిలువయుంచెను. కాని బ్రహ్మయొక్క వరదానము కారణముగా నేనా దురాత్ముని యభివృద్ధిని సహింపవలసి వచ్చినది.

చందన వృక్షము విధినియతివల్లనే కదా సర్పము నభివృద్ధిని సహించుచున్నది. ఆ రావణుడు తపస్సుచే బ్రహ్మను తృప్తిపరచి, మానవులందు అనాదరముగల వాడై, దేవజాతులవల్ల తనకు మృత్యువు కలుగకుండునట్లు వరము సంపాదించెను గదా.

నేను దశరథ మహారాజునకు పుత్రుడనై జన్మించి ఆ రావణుని శిరస్సులనెడి తమ్మిపూలచే రణభూమికి పూజాబలి సమర్పింతును. అచిరకాలముననే మీరెల్లరు యజ్వలచే సమర్పింపబడిన హవిర్భాగములను, రాక్షసులు స్పృశింపనివానిని, స్వీకరింపగలరు. ఆకాశ మార్గమున విమానములందు సంచరించుచు, పుష్పక దర్శన భీతిచే మేఘముల మరుపున దాగయత్నించు పుణ్యాత్ములు ఇంక అట్టి భీతినుండి ముక్తులగుదురుగాక. నలకూబరుని శాపమునకు గట్టుపడియున్న రావణుడు బందీకృతలైన దేవతాస్త్రీలను కేశాకర్షణాదులచే కలుషితలను గావింపజాలడయ్యెను. ఇంక మీరా స్వర్గాంగనలను విడిపించి వారి కేశబంధములను విడిపింపవచ్చును."

రావణుడనెడి అనావృష్టిచే శోషిల్లియుండిన దేవతలనెడి సస్యమును ఈ విధమైన వాక్యములనెడి అమృతముచే అభివర్షించి విష్ణుదేవుడనెడు మేఘము అంతర్థానమందెను. ఇంద్రాదులైన దేవతలుగూడ దేవకార్యమునందు ఉద్యుక్తుడైన విష్ణువును తమ తమ యంశములచేత, వృక్షములు తమ పుష్పములచేత వాయువు ననుసరించినట్లు అనుసరించిరి.

క్షీర సాగరమున శ్రీమహా విష్ణువు దేవతలతో బలుకుచుండిన అభయ వాక్యములు ముగియు నప్పటికి అయోధ్యయందు దశరథుడు చేయుచుండిన పుత్రకామేష్టియు ముగిసెను. అప్పుడు యాజకులందరు నాశ్చర్యపడుచుండ యాగాగ్నినుండి యొక పురుషు డావిర్భవించెను. ఆదిపురుషుడైన శ్రీమహా విష్ణువు అధిష్ఠించినందువల్ల భరింప శక్యముగాని పాయసాన్నముగల బంగరు గిన్నెను రెండు చేతులతో ధరించియున్న ఆ పురుషుడు అందీయగా దశరథుడు స్వయముగా ఆ పాయస పాత్రమును స్వీకరించెను. ఆ స్వీకరించుట సముద్రునిచే బయటబెట్టబడిన అమృతకలశమును దేవేంద్రుడు స్వీకరించినట్లుండెను. లోకత్రయమునకును జన్మహేతువైన పరమపురుషుడే జన్మకొఱకై దశరథుని ఆశ్రయించినందువల్ల ఆ మహారాజు అన్య దుర్లభములైన గుణములు వెల్లడియైనవి.

# పాయస ప్రదానము

ప్రాజాపత్య పురుషుడు తనకిచ్చిన హేమపాత్ర మందలి పాయసాన్నమును దశరథుడు సూర్యుడు తన బాలాతపమును భూమ్యాకాశములకు పంచి యిచ్చినట్లు, తన భార్య లిరువురకు పంచి యిచ్చెను. పట్టమహిషియైన కౌసల్య తనకు మాన్యురాలును, కైకేయి ప్రియురాలును గనుక దశరథుడు పాయసమును ముందుగా వారిద్దరకు పంచి యిచ్చి వారు తమ భాగములనుండి కొంత కొంత సుమిత్ర కిచ్చి యామెను సంభావించునట్లు చేయవలెనని మనస్సున అభిప్రాయ పడెను. పతి యభిప్రాయము నెరింగిన భార్య లిద్దరును తమ వంతుకు వచ్చిన పాయసములో కొంత భాగము సుమిత్రకిచ్చిరి. ఏనుగుయొక్క చెక్కిళ్ళయందలి మదలేఖలందు అనురక్త యగు భ్రమరివలె సుమిత్ర ఆ యిరువురు సపత్నులందును ప్రేమగ్గలదయ్యెను.

పాయసాన్నము భుజించిన ముప్పురు రాణులును అమృత లను పేరు గల సౌరనాడులు ప్రజాభ్యుదయముకొఱకు జలమయములైన గర్భములు ధరించినట్లు లోకముయొక్క అభ్యుదయముకొఱకు గర్భములు ధరించిరి. ఏకకాలమున గర్భము ధరించిన యా ముప్పురును అంతర్గత ఫలారంభమైన సస్య సంపదలవలె పాండువర్ణము దాల్చిరి. గర్భములు వర్ధిల్లుచున్నకాలందియు వారికి విచిత్రములైన స్వప్నములు రాదొడగెను. ఆ ముప్పురును శంఖ చక్ర గదాదులు ధరించిన వామన మూర్తులు తమ్ము కాపాడుచున్నట్లును, బంగరు ఱెక్కల కాంతులు గగనమున ప్రసరింపజేయుచు, వేగముచే మేఘములను తన దిక్కునకు ఆకర్షించుచు నున్న గరుత్మంతుడు తమ్ము సేవించుచున్నట్లును, విష్ణుదేవుడు తనకు దాచ నిచ్చిన కౌస్తుభమణిని స్తనముల నడుమ ధరించి, పద్మమనెడు వీవన చేతదాల్చి లక్ష్మీదేవి తమకు పరిచర్య చేయుచున్నట్లును, ఆకాశగంగానదియందు స్నానమాచరించి, వేద రహస్యముల నుపన్యసించుచు వచ్చి సప్తమహర్షులు తమ్ము ఉపాసించుచున్నట్లును స్వప్నములు కాంచిరి.

తమకు స్వప్నములందగపడిన యంశములన్నియు రాణులు నివేదింపగా విని జగజ్జనకుడైన శ్రీమన్నారాయణుడు తన్ను జనకునిగా వరించెనుగదా యని దశరథుడు పరమానందభరితుడయ్యెను. ఈ విధముగా పాయస భాగముల నాశ్ర

యించి నాల్గుగా విభజింపబడిన విష్ణు తేజము ప్రతిమాచంద్రుడు భిన్నజలముల ఉదరములందు భిన్నమూర్తియై యుండునట్లు ముప్వురు రాణుల యుదరములందును భిన్నరూపమై యుండెను.

## పుత్త్రోదయము

పదియవ నెలయందు దశరథుని యగ్రమహిషియైన కౌసల్య రాత్రివేళ యందు ఓషధీలత జ్యోతిని ప్రసవించినట్లు శోకనాశకుడైన పుత్త్రుని ప్రసవించెను. మనోభిరామమైన యా కుమారుని శరీర సౌందర్యముచే ప్రేరితుడై దశరథుడు ఆతనికి రాముడు అని నామకరణము చేసెను. ఆ రామనామము సర్వలోకములకు శోభనప్రదమయ్యెను. రఘువంశమును ప్రకాశింపజేయు మహాతేజస్వియైన ఆ కుమారునిచేత పరాభవింపబడినవా యన్నట్లు ప్రసూతిగృహమందలి దీపములు వెలవెల బోయెను. ప్రసవించినందున కృశించియున్న కౌసల్య తనప్రక్కన పరుండియున్న శిశువుతో శరదృతువున కృశించిన గంగానది తన యిసుకతిన్నెపై నున్న కమల పుష్పోపహారముతో శోభిల్లినట్లు శోభిల్లెను.

తరువాత కైకేయికి శీలవంతుడైన భరతుడు జన్మించి వినయము సంపద నలంకరించినట్లు తన జననిని అలంకరించెను. పిదప చక్కగా నభ్యసింపబడిన విద్య తత్త్వజ్ఞాన వినయములను ప్రసవించినట్లు సుమిత్రయు లక్ష్మణ శత్రుఘ్ను లను కవలను ప్రసవించెను.

శ్రీరాముడు అవతరించినందున ప్రపంచము నిర్దోషము గుణవంతము నై పురుషోత్తముడు మర్త్యలోకమునం దవతరింపగా స్వర్గముకూడ ఆయనవెంట మర్త్యమునకు వచ్చెనా యన్నట్లుండెను. రావణునివల్ల భీతులైన ప్రభువులు గల చతుర్దిశలు ఆ పురుషోత్తముని యవతారమువల్ల ఊరడిల్లినవా యన్నట్లు ధూళి రహితములైన వాయువులను ఉచ్ఛ్వసించెను. ధూమము తొలగుటచే అగ్నియు, నిర్మలత్వముచే సూర్యుడును రావణ కృత పరాభవమువల్ల గలిగిన దుఃఖమును విడిచిరా యన్నట్లుండిరి. ఆ క్షణమునందే రావణాసురుని కిరీటములనుండి మణులు రాలి పడెను. అది రాక్షసలక్ష్మి యశ్రుబిందువుల పతనమా యన్నట్లుండెను.

దశరథమహారాజునకు పుత్రులు జన్మించిరన్న శుభవార్తను ప్రకటించుటకు అయోధ్యయందు తూర్యనాదములు ప్రారంభమగుటకు ముందే ఆకాశమున దేవ దుందుభులు మ్రోగెను. గగనమునుండి కల్పవృక్ష కుసుమములు వర్షించి అయోధ్య యందలి మంగళోపచారములకు అదియే తొలిరచన యయ్యెను.

జాతకర్మాది సంస్కారములు జరిగిన కుమారులు నలుగురు దాదుల స్తన్యములు గ్రోలుచు తమకంటె ముందే పుట్టిన దశరథుని యానందముతోపాటు దినదినాభివృద్ధి నందుచుండిరి. ఆజ్యాది హవిస్సులచేత అగ్నియొక్క సహజ తేజము వర్ధిల్లినట్లు పెద్దల శిక్షణచేత ఆ కుమారుల సహజ వినయము మిక్కిలి వృద్ధి చెందెను. పరస్పర విరుద్ధములయ్యు ఆరు ఋతువులు నందనవనమును ఏక కాలముననే ప్రకాశింపజేసినట్లుగా భిన్నులయ్యు పరస్పర అవిరుద్ధులైన ఆ నలువురు కుమారులు రఘువంశమును శోభిల్ల జేయుచుండిరి.

పరస్పర సౌభ్రాత్రము సమానమే యయ్యు ఆ నలువురిలో ప్రీతిచేత రామ లక్ష్మణులు, భరత శత్రుఘ్నులు జంటలుగా నేర్పడిరి. వాయ్వగ్నులకు, చంద్ర సముద్రులకు గల పరస్పర ప్రీతివలె ఈ జంటలకు గల పరస్పరప్రీతియు నెన్నడు భంగము పొందలేదు. తమ తేజస్సుచేతను, వినయముచేతను ఆ రాజకుమారులు గ్రీష్మాంతము శ్యామలాభ్రములైన దివసములువలె ప్రజల హృదయములను హరించిరి. నాల్గుగా విభక్తమై కనబడుచున్న దశరథుని సంతానము శరీరవంతమై యవతరించిన ధర్మార్థ కామ మోక్షములవలె నుండెను.

చతుర్దిగంత పాలకుడైన యీ దశరథమహారాజును రత్నములచేత చతుస్సాగరములు ఆరాధించినట్లు తమ మహాగుణములచేత ఆ నలుగురు కుమారులు ఆరాధించుచుండిరి. రాక్షసుల ఖడ్గధారలను భగ్నము గావించు నాల్గు దంతములచే ఐరావత గజేంద్రము ప్రకాశించినట్లు, ఫలప్రాప్తిచే వ్యక్తము చేయబడిన యోగ్యతగల నాల్గు ఉపాయములచే రాజనీతి ప్రకాశించినట్లు, దీర్ఘములైన నాల్గు బాహువులచే శ్రీహరి ప్రకాశించినట్లు, ఆ శ్రీహరి యంశములైన నలువురు పుత్రులచే దశరథుడు మిక్కిలి ప్రకాశించెను.

---

శ్రీః

# ర ఘు వ ం శ ము

## ద శ మ స ర్గ ము

శ్లో॥ పృథివీం శాసత స్తస్య
పాకశాసన తేజసః
కించి దూన మనూనర్ద్ధే
శ్శరదా మయుతం యయౌ. 1

పద విభాగము : పృథివీం, శాసతః, తస్య, పాకశాసన తేజసః, కించిత్, ఊనం, అనూనర్ద్ధేః, శరదాం, అయుతం, యయౌ.

అన్వయము : పృథివీం శాసతః పాకశాసన తేజసః అనూనర్ద్ధేః తస్య కించిత్ ఊనం శరదాం అయుతం యయౌ.

అర్థము : పృథివీం = భూమిని; శాసతః = పాలించుచున్న; పాకశాసన-తేజసః = ఇంద్రుని తేజస్సువంటి తేజస్సుగల; అనూన = అనల్పమైన; ఋద్ధేః = సమృద్ధిగల; తస్య = ఆ దశరథునకు; కించిత్ = కొంచెము; ఊనం = తక్కువయయిన; శరదాం = సంవత్సరములయొక్క; అయుతం = పది వేలు; యయౌ = గడచెను.

తాత్పర్యము : భూమిని పాలించుచుండిన, దేవేంద్ర సమ తేజుడైన, మహా సమృద్ధి గల ఆ దశరథమహారాజునకు కొంచెము తక్కువగా పదివేల సంవత్సరములు గడచిపోయెను.

వ్యాఖ్యానము : దశరథమహారాజు రాజ్యము పాలించుచుండగా కొంచెము తక్కువగా పదివేల సంవత్సరములు గడచెను. ఆయన అరువదివేల సంవత్సరములు పైగా జీవించెనని రామాయణమందలి వాక్యమువలన దెలియుచున్నది. "షష్టి ర్వర్ష సహస్రాణి జాతస్య మమ కౌశిక : దుఃఖేనోత్పాదిశ్చాయం; న రామం నేతు

మ్మాసి"–"నాకు ఇప్పుడు అరువది వేల సంవత్సరములు. ఇతనిని ఎంతో కష్టపడి కంటిని. కౌశికుడా ! ఈ రాముని తీసికొనిపోకుము" అని దశరథుడు విశ్వామిత్రుని వేడుకొనెను. కాళిదాసే ఏనిమిదవ సర్గము చివర "సమ్యగ్వినీత మథ వర్మహారం కుమారం ఆదిశ్య రక్షణ విధౌ విధివత్ప్రజానాం" – ఇత్యాది శ్లోకమున అజమహారాజు కవచధారణ వయస్సువచ్చిన దశరథుని పట్టాభిషిక్తుని గావించెనని వ్రాసెను. కౌమారదశయందు పట్టాభిషిక్తుడైన దశరథుడు ఆనాటినుండి శ్రీరామ జనన కాలమువరకు పదివేల యేండ్లు పాలించెననుట పొసగదు. కనుక ముని శాపానంతరము దశరథుడు కొంచెము తక్కువగా పదివేల యేండ్లు పాలించిన యనంతరము పుత్రకామేష్టికి పూనుకొనెనని చెప్పవలెను. నవమ సర్గాంతమున ముని శాప ప్రసంగ ముండుటయు, ఈ సర్గారంభమున పరిపాలనాకాల ప్రసంగ ముండుటయు చూడగా ఈ పాలనాకాలము శాపానంతర కాలమే యని నిర్ణయింపవలెను.

దశరథుడు పాకశాసనతేజుడు అనగా దశరథుడు ప్రతాపమున, భోగమున, వైభవమున, ప్రాభవమున ఇంద్రతుల్యుడని భావము. "శరదా మయుతం యయౌ" అనుటనుబట్టి ముని శాపానంతరము ఆయన రాజ్యపాలనమునం దాసక్తుడై సంతాన ప్రాప్తియందే లగ్నమనస్కుడై యుండగా సంవత్సరములు ఆయనకు తెలియకుండగనే గడచిపోయినవని భావము. "కించిదూనం" అనుట పదివేలకు తక్కువైన ఆ స్వల్పకాలములో రామాదులు జన్మించుట, వివాహితులు, వనగతులు నగుట, దశరథుడు మరణించుట జరుగునని సూచించుటకు.

ఈ సర్గమున చివరి పద్యము తప్ప అన్నియు శ్లోకములే. శ్లోక లక్షణము– "పంచమం లఘు సర్వేషాం, సప్తమం ద్వి చతుర్థయోః, గురు షష్ఠం చ సర్వేషాం, ఏతత్ శ్లోకస్య లక్షణమ్". అన్ని పాదములందును 5వ అక్షరము లఘువు, 6వ యక్షరము గురువు; రెండవ నాల్గవ పాదములందు 7 వ యక్షరము లఘువు. తక్కిన యక్షరము లెట్లయిన నుండవచ్చును. పాదమున ఎనిమిది యక్షరములు. అట్టివి నాలుగు పాదములు. అనుష్టుప్ ఛందమున బుట్టి పై లక్షణములు గలిగిన పద్యమునకు శ్లోకము అని పేరు.

శ్లో॥ న చోపలేభే పూర్వేషా
మృణ నిర్మోక్ష సాధనమ్
సుతాభిధానం స జ్యోతి
స్సద్య శ్శోక తమోఽపహమ్. 2

పద విభాగము : న, చ, ఉప లేభే, పూర్వేషాం, ఋణనిర్మోక్ష సాధనం, సుతాభిధానం, సః, జ్యోతిః, సద్యశ్శోక తమోఽపహం.

అన్వయము : సః పూర్వేషాం ఋణనిర్మోక్ష సాధనం సద్యశ్శోక తమోఽపహం సుతాభిధానం న ఉపలేభే చ.

అర్థము : సః = ఆ దశరథుడు; పూర్వేషాం = పితృదేవతలయొక్క; ఋణ = ఋణమునుండి; నిర్మోక్ష = విముక్తికి; సాధనం = కారణము; సద్యః = తత్క్షణమే; శోక = దుఃఖ మనెడు; తమః = చీకటిని; అపహం = పోగొట్టునది యైన; సుత + అభిధానం = పుత్రు డను పేరు గల; జ్యోతిః = వెలుగును; న-ఉపలేభే-చ = పొందలేదు కూడను.

తాత్పర్యము : ఆ దశరథమహారాజు పితృదేవతల ఋణమునుండి విముక్తి గలుగుటకు సాధనమును, తక్షణమే శోకమనెడు చీకటిని పోగొట్టునదియు నైన పుత్రు డను పేరిటి వెలుగును పొందజాలడయ్యెను.

అలంకారము : రూపకము.

వ్యాఖ్యానము : 'చ'కార ప్రయోగము పూర్వశ్లోకముతో సంబంధము సూచించును. పదివేల యేండ్లు గడచినవి కాని ఆయనకు సంతానము కలుగలేదు అని పూర్వశ్లోకార్థముతో సంబంధము. "పుంనామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్రః"-పుంనామ నరకమునుండి రక్షించువాడు పుత్రుడు. "అపుత్రస్య గతిర్నాస్తి" పుత్రులు లేనివానికి ఉత్తమగతి లేదు. ఆతనికే కాదు అతని పూర్వులకును ఉత్తమ గతి యుండదు. కనుక పుత్రులు లేనివాడు పితృఋణముక్తుడు కాజాలడు. "ఏష వా అనృణో యః పుత్రీ" - ఎవ్వడు పుత్రవంతుడో వాడే ఋణముక్తుడు అని శ్రుతి. దశరథుడు భూలోకమున దేవేంద్రుడే యైనను పుత్రు డుదయించిననే తప్ప ఆయనకు స్వర్గమున స్థానము లభింపదు. పుత్రు డను జ్యోతి శోక మను చీకటిని బోగొట్టునది యని పుత్రునియందు జ్యోతిని, శోకమునందు చీకటిని ఆరోపించుటచే నిది రూపకము. శోకమున చీకటి నారోపించుట సుతునియందు జ్యోతిని ఆరోపించుటకు గారణమగుచున్నది గనుక ఇది పరంపరిత రూపకము. "సుతాభిధానం జ్యోతిః" అన్నప్పుడు వాక్యగతము, శోకతమస్సు అన్నప్పుడు సమాసగతము. ఇచ్చట పుత్రునియందు జ్యోతి నారోపించుట రమ్యముగా నున్నది. ఏలన, పుట్టబోవు శ్రీరాముడు సాక్షాత్తు పరంజ్యోతియే.

శ్లో॥ అతిష్ఠ త్ప్రత్యయాపేక్ష
సంతతి స్స చిరం నృపః
ప్రాఙ్మంథా దనభివ్యక్త
రత్నోత్పత్తి రివార్ణవః. 3

పద విభాగము : అతిష్ఠత్, ప్రత్యయాపేక్ష సంతతిః, సః, చిరం, నృపః, ప్రాక్, మంథాత్, అనభివ్యక్త రత్నోత్పత్తిః, ఇవ, అర్ణవః.

అన్వయము : ప్రత్యయాపేక్ష సంతతిః సః నృపః మంథాత్ ప్రాక్ అనభివ్యక్త రత్నోత్పత్తిః అర్ణవః ఇవ అతిష్ఠత్.

అర్థము : ప్రత్యయ = హేతువును; అపేక్ష = అపేక్షించునటువంటి; సంతతిః = సంతానము గలవాడై; సః-నృపః = ఆ దశరథమహారాజు; మంథాత్ = మథనముకంటె; ప్రాక్ = ముందు; అనభివ్యక్త = కనబడని; రత్న + ఉత్పత్తిః = రత్నముల యుత్పత్తిగల; అర్ణవః-ఇవ = సముద్రమువలె; అతిష్ఠత్ = ఉండెను.

తాత్పర్యము : ఒకానొక హేతువు నపేక్షించు సంతానము గల ఆ దశరథ మహారాజు మథనమునకు పూర్వము అదృష్టమైన రత్నముల యుత్పత్తి గల సముద్రమువలె నుండెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : దశరథునకు పుట్టబోవు సంతానము ఆయన శోకమును మాత్రమే తొలగించునంతటి సామాన్యమైనది కాదు. కనుకనే దాని యుత్పత్తి కెంతో కారణ కలాపము ఏర్పడవలసి యున్నది. అందువల్లనే దశరథుడు సంతతి కొఱకు పదివేల యేండ్లు వేచియుండవలసివచ్చినది. సముద్రమున రత్నములున్నవి కాని దేవదానవులు ఎంతో శ్రమపడి మథించినప్పుడు గాని అవి బయటబడలేదు. శుక్తులు, శంఖములు ఊరకనే బయటబడును. దశరథునిలో పుత్రులున్నారు. వారు రత్నములవంటివారు గనుక దేవదానవులు మథించిన గాని వారు బయట బడరు. చిరకాలమునకు ఆయనకు సంతతి యుద్భవించు సమయ మాసన్నమైనది. దానికి గావలసిన సాధన సామగ్రి యేర్పడినది.

దశరథుడు సముద్రునితో, ఆయన పుత్రులు రత్నములతో పోల్చబడిరి కనుక ఇది ఉపమాలంకారము.

దశరథుడు చిరకాలము సంతానముకొఱకు కెట్టి ప్రయత్నము చేయలేదు. కారణము ఆ సంతతి తన మరణమునకు హేతువగుట – పుత్ర దుఃఖముచే నీవు మరణింతువు అని ముని శపించెను గదా. పుత్రుడు జన్మించుట తథ్యమని శాపమునందే ఇమిడి యున్నది. దశరథునకు పుత్రులు లేరన్న దుఃఖమున్నది. పుత్రులు కలుగుదురన్న విశ్వాసమున్నది. ఆ పుత్రులతో చిరకాలము సుఖముగా జీవించు భాగ్యము లేదు గదా యన్న నిరాశ యున్నది. కనుక ఆయన చిరకాలము పుత్ర జన్మకై నిరీక్షించుచు ఊరకుండెనే కాని అందుకొఱకు ఎట్టి ప్రయత్నము చేయలేదు. ఆ పుత్రులు కారణజన్ములు గనుక, వారు జన్మించుటకు గావలసిన కారణ కలాపము ఏర్పడినది గనుక దశరథునకు పుత్రోత్పత్తికై ప్రయత్నము చేయవలెనని బుద్ధి పుట్టెను.

శ్లో॥ ఋశ్యశృంగాదయ స్తస్య
సంత స్సంతాన కాంక్షిణః
ఆరేభిరే యతాత్మానః
పుత్రీయా మిష్టి మృత్విజః. 4

పద విభాగము : ఋశ్యశృంగాదయః, తస్య, సంతః, సంతాన కాంక్షిణః, ఆరేభిరే, యతాత్మానః, పుత్రీయాం, ఇష్టిం, ఋత్విజః.

అన్వయము : యతాత్మానః సంతః ఋశ్యశృంగాదయః ఋత్విజః సంతాన కాంక్షిణః తస్య పుత్రీయాం ఇష్టిం ఆరేభిరే.

అర్థము : యత + ఆత్మానః = అవహితచిత్తులు; సంతః = మహాత్ములునైన; ఋశ్యశృంగ + ఆదయః = ఋశ్యశృంగుడు మొదలుగాగల; ఋత్విజః = యాజకులు; సంతాన–కాంక్షిణః = సంతతిని గోరుచున్న; తస్య = ఆ దశరథునకు; పుత్రీయాం = పుత్రనిమిత్తమయిన; ఇష్టిం = యాగమును; ఆరేభిరే = ఆరంభించిరి.

తాత్పర్యము : ఏకాగ్ర మనస్కులు, మహాత్ములు నైన ఋశ్యశృంగుడు మొదలుగా గల యాజకులు సంతానము నపేక్షించుచున్న యా దశరథునకు పుత్రోత్పత్తి కారణమైన యాగమును ఆరంభించిరి.

వ్యాఖ్యానము : నిరీక్షించి, నిరీక్షించి, లోకసామాన్యమైన మార్గమున తనకు పుత్రులు జన్మింపరని గుర్తించి దశరథుడు తన పుత్రకాంక్షను ఋశ్య శృంగాదులకు దెలిపెను. వారు మంత్రసిద్ధులు, అఘటనఘటనా సమర్థులు. పుత్రోత్పాదన సమర్థమైన యాగము ప్రారంభించిరి. రోమపాదుని యాత్మజ, దశ రథుని పెంపుడు కూతురు నైన శాంతాదేవి భర్త ఋశ్యశృంగుడు. మహిమాన్వి తుడు, మహర్షి యైన ఆయన నాయకత్వమున మహాత్ములైన ఋత్విజులు పుత్ర కామేష్టి యారంభించిరి. దశరథునకు తప్పక పుత్రులు పుట్టుదురు. ఎట్టివారు పుట్టుదురనగా రత్నముల వంటివారని వెనుకటి ఉపమానము.

శ్లో॥ తస్మి న్నవసరే దేవాః
పౌలస్త్యోపప్లుతా హరిమ్
అభిజగ్ము ర్నిదాఘార్తాః
ఛాయావృక్ష మివాధ్వగాః. 5

పద విభాగము : తస్మిన్, అవసరే, దేవాః, పౌలస్త్యోపప్లుతాః, హరిం, అభిజగ్ముః, నిదాఘార్తాః, ఛాయావృక్షం, ఇవ, అధ్వగాః.

అన్వయము : తస్మిన్ అవసరే దేవాః పౌలస్త్యోపప్లుతాః (సంతః) నిదాఘార్తాః అధ్వగాః ఛాయావృక్షం ఇవ హరిం అభిజగ్ముః.

అర్థము : తస్మిన్ = ఆ; అవసరే = సమయమునందు; దేవాః = దేవతలు; పౌలస్త్య = రావణునిచే; ఉపప్లుతాః (సంతః) = పీడితులై; నిదాఘ = గ్రీష్మముచే; ఆర్తాః = పీడితులైన; అధ్వగాః = బాటసారులు; ఛాయావృక్షం + ఇవ = నీడగల చెట్టును వలె; హరిం = విష్ణువును; అభిజగ్ముః = చేరబోయిరి.

తాత్పర్యము : ఆ సమయమున దేవతలు రావణునిచే పీడింపబడినవారై గ్రీష్మ పీడితులైన బాటసారులు నీడగల చెట్టును చేరబోయినట్లు విష్ణుదేవుని చేరబోయిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పుత్రులు జన్మింతురని వేచి వేచి దశరథుడు చిరకాలము నకు పుత్రకామేష్టి యారంభించెను. విష్ణువు అవతరించి రావణుని సంహరించును గదా యని వేచి వేచి దేవతలు చివరికి తామే ఆయన నవతరింపుమని ప్రార్థించు టకై ఆయనవద్దకేగిరి. ఈ రెండును ఏకకాలమున జరిగినవి. విష్ణుదేవుడును ఎప్పుడు, ఎచ్చట అవతరింపవలెనా యని యెదురు చూచుచుండెను.

రావణుడు నిదాఘముతో, దేవతలు అధ్వగులతో, విష్ణువు ఛాయావృక్ష ముతో పోల్చబడుటచే ఇది ఉపమాలంకారము. "ఊర్ధ్వమూల మధశ్శాఖం" అని విష్ణువునకు వృక్షౌపమ్యము గీతలో ప్రసిద్ధము. ఈ యౌపమ్యమును కాళిదాసు ప్రకరణోచితముగా లౌకికముగా మార్చెను. "హరిం" అనుటవల్ల ఆయన రావణుని ప్రాణములు హరించి దేవతల యార్తిని హరించునని వ్యంగ్యము. ఈ శ్లోకమున నిదాఘముతో పోల్చబడిన రావణుడు 49వ శ్లోకమున అపగ్రహ ముగా రూపింపబడుట గమనింపదగును.

శ్లో॥ తే చ ప్రాపు రుదన్వంతం
బుబుధే చాదిపూరుషః
అవ్యాక్షేపో భవిష్యంత్యాః
కార్యసిద్ధే ర్హి లక్షణమ్. 6

పద విభాగము : తే, చ, ప్రాపుః, ఉదన్వంతం, బుబుధే, చ, ఆది పూరుషః, అవ్యాక్షేపః, భవిష్యంత్యాః, కార్యసిద్ధేః, హి, లక్షణం.

అన్వయము : తే చ ఉదన్వంతం ప్రాపుః ఆదిపూరుషః చ బుబుధే; అవ్యా క్షేపః భవిష్యంత్యాః కార్యసిద్ధేః లక్షణం హి.

అర్థము : తే–చ = ఆ దేవతలును; ఉదన్వంతం = సముద్రమును; ప్రాపుః = చేరిరి; ఆది–పూరుషః–చ = విష్ణుదేవుడును; బుబుధే = మేల్కాంచెను; అవ్యాక్షేపః = కాలవిలంబనము లేమియే; భవిష్యంత్యాః = కాగల; కార్య–సిద్ధేః = కార్యసిద్ధియొక్క; లక్షణం–హి = లక్షణము గదా.

తాత్పర్యము : ఆ దేవతలు సముద్రము చేరిరి. విష్ణుదేవుడు నిద్ర వీడెను. కార్య విలంబనము లేకుండుట జరుగబోవు కార్యసిద్ధియొక్క లక్షణము గదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : దేవతలు క్షీరసాగరము చేరుటయు, ఆదిపురుషుడు మేల్కాంచుటయు ఏకకాలమున జరిగినవి. ఇది శుభ సూచన. ఆయన లేచునప్పటికి వారు వచ్చుట, వారు వచ్చునప్పటికి ఆయన లేచుట - భావి కార్యసిద్ధి సూచకములు. దుష్టశిక్షణ ఆయన కార్యము. రావణ నాశనము దేవతల కార్యము. ఈ రెండును కలసినవి. మరల నీ రెండును దశరథుని పుత్రలాభ కార్యముతో కలసినవి. దశరథుని పుత్రప్రాప్తి ప్రత్యయాపేక్షమనగా నిదియే. ఎల్లర కార్యములు సిద్ధించుటకు గావలసిన కారణములన్నియు ఏకకాలమున సమకూడినవి గనుక కార్యసిద్ధి నిశ్చితము. దశరథుడు యాగ మారంభించిన సమయముననే దేవతలు విష్ణునివద్దకు బోయిరి. వారు వచ్చిన క్షణమునందే ఆయన యోగనిద్రనుండి మేల్కాంచెను. ఎచ్చటను విలంబము లేదు. ఇట్లు విలంబము లేకుండుట కార్యసిద్ధికి లక్షణమని యర్థాంతరన్యాసముచే స్థాపింపబడినది.

శ్లో॥ భోగి భోగాసనాసీనం
దదృశు స్తం దివౌకసః
తత్ఫణా మండలోదర్చి
ర్మణి ద్యోతిత విగ్రహమ్. 7

పద విభాగము : భోగిభోగాసనాసీనం, దదృశుః, తం, దివౌకసః, తత్ఫణా మండలోదర్చి ర్మణి ద్యోతిత విగ్రహం.

అన్వయము : దివౌకసః భోగిభోగాసనాసీనం తత్ఫణామండలో దర్చి ర్మణి ద్యోతిత విగ్రహం తం దదృశుః.

అర్థము : దివౌకసః = దేవతలు; భోగి = ఆదిశేషునియొక్క; భోగ = శరీర మనెడు; ఆసన = సింహాసనమున; ఆసీనం = కూర్చుండిన; తత్ = ఆ యాదిశేషునియొక్క; ఫణా = పడగలయొక్క; మండల = సమూహమున; ఉదర్చిః = జ్వలించుచున్న; మణి = మణులచే; ద్యోతిత = ప్రకాశింప జేయబడుచున్న; విగ్రహం = శరీరము గల; తం = ఆ విష్ణుదేవుని; దదృశుః = దర్శించిరి.

తాత్పర్యము : ఆ దేవతలు ఆదిశేషుని శరీర మనెడు సింహాసనమున గూర్చుండి, శేషుని పడగల సమూహమున జ్వలించుచున్న మణులచే ప్రకాశింప జేయబడిన శరీరము గల విష్ణువును చూచిరి.

వ్యాఖ్యానము : ఆదిపురుషుడు యోగనిద్రాగతుడై యున్నంతసేపు ఆయనకు శయ్యగా నుండిన భోగి భోగము ఆయన మేల్కాంచినంతనే సింహాసనముగా మారెను. ఆ యాసనమున గూర్చుండిన ఆ స్వామిపై శేషుని సహస్ర ఫణములందు వెలుగుచున్న మణుల కాంతులు ప్రసరించుచుండెను. ఆ దేవుని దివ్యమంగళ విగ్రహమును దేవతలు దర్శించిరి. 14వ శ్లోకమువఱకు 8 శ్లోకములలో ఆది దేవుని దివ్యదర్శన వర్ణనము. క్షీరసాగర సారభూతమైన ఈ దివ్యపదార్థము పుత్రకామేష్టియందు పాయసాన్నసారమై దశరథుని సంతానముగా నవతరింపబోవు చున్నది. కనుకనే కవి ఇంత యభినివేశముతో వర్ణించుట.

శ్లో॥ శ్రియః పద్మ నిషణ్ణాయాః
క్షౌమాంతరిత మేఖలే
అంకే నిక్షిప్త చరణ
మాస్తీర్ణ కర పల్లవే. 8

పద విభాగము : శ్రియః, పద్మనిషణ్ణాయాః, క్షౌమాంతరిత మేఖలే, అంకే, నిక్షిప్త చరణం, ఆస్తీర్ణ కరపల్లవే.

అన్వయము : పద్మనిషణ్ణాయాః శ్రియః క్షౌమాంతరిత మేఖలే ఆస్తీర్ణ కరపల్లవే అంకే నిక్షిప్త చరణం –

అర్థము : పద్మ = కమలమున; నిషణ్ణాయాః = కూర్చుండిన; శ్రియః = లక్ష్మియొక్క; క్షౌమ = పట్టుచీరచే; అంతరిత = కప్పబడిన (వ్యవహితమైన); మేఖలే = మొలనూలు గలదియు; ఆస్తీర్ణ = పరచబడిన; కర–పల్లవే = చిగురు వంటి కరములు గలదియు నగు; అంకే = అంకమునందు; నిక్షిప్త = ఉంచబడిన; చరణం = పాదములు గలవానిని (తం దదృశుః అని 7వ శ్లోకముతో అన్వయము.)

తాత్పర్యము : పద్మమునందు గూర్చుండియున్న లక్ష్మీదేవియొక్క పట్టు చీరెచే కప్పబడిన మొలనూలు గలదియు, పరచబడిన చిగురులవంటి హస్తములు

గలదియు నగు అంకమునందు ఉంచబడిన పాదములు గలవానిని (ఆ విష్ణువును దర్శించిరి.)

వ్యాఖ్యానము : ఆ దేవుని పాదము పద్మాసీనయైన లక్ష్మి యంకమున నున్నది. సింహాసన మెంత మెత్తనిదో పాదపీఠము అంతమెత్తనిదే. తన నడుమున నున్న మేఖల యందలి మణుల కాఠిన్యము స్వామి మృదుచరణములకు బాధ కలిగించునేమో యని లక్ష్మీదేవి ఆ మేఖలపై మెత్తని పట్టుచీర చెరగు పరచినది. దానిపై పల్లవములవంటి తన హస్తముల నుంచినది. వానిపై స్వామి చరణములున్నవి. అవి యెంత సుకుమారములో ! అవి కందునో యని ఆ దేవి కెంత శ్రద్ధయో !

శ్లో॥ ప్రబుద్ధ పుండరీకాక్షం
బాలాతప నిభాంశుకమ్
దివసం శారద మివ
ప్రారంభ సుఖ దర్శనమ్. 9

పద విభాగము : ప్రబుద్ధ పుండరీకాక్షం, బాలాతప నిభాంశుకం, దివసం, శారదం, ఇవ, ప్రారంభ సుఖదర్శనం.

అన్వయము : ప్రబుద్ధపుండరీకాక్షం బాలాతపనిభాంశుకం ప్రారంభ సుఖ దర్శనం శారదం దివసం ఇవ (స్థితం) -

అర్థము: ప్రబుద్ధ = వికసించిన; పుండరీక = తెల్లతామరలవంటి; అక్షం = కన్నులు గలవానిని; బాల + ఆతప = లేత యెండతో; నిభ = సమానమైన; అంశుకం = వస్త్రము గలవానిని; ప్రారంభ = ప్రకృష్టములైన ప్రయత్నములు గల యోగులకు; సుఖ-దర్శనం = సుఖముగా దర్శింపదగినవానిని (విష్ణువును); ప్రబుద్ధ పుండరీకాక్షం = వికసించిన పద్మములే కన్నులుగా గలదానిని; బాలాతప నిభాంశుకం = లేయెండ యను బట్ట గలదానిని; ప్రారంభ సుఖదర్శనం = మొదట సుఖమైన దర్శనము గలదానిని; శారదం = శరదృతు సంబంధియైన; దివసం-ఇవ = దినమును వలె; స్థితం = ఉన్నవానిని; (తం దదృశుః అని యన్వయము.)

తాత్పర్యము : వికసించిన పద్మములవంటి కన్నులు గలవాడును, లేయెండ వంటి వస్త్రము గలవాడును, యోగులకు సుఖముగా జూడదగినవాడును అయి వికసించిన పద్మము లనెడు కన్నులు గలది, లేయెండ యనెడు వస్త్రము గలది, ప్రారంభమున సుఖమైన దర్శనము గలది యైన శరత్కాలపు దినమువలె ఉన్న వానిని (ఆ విష్ణువును దర్శించిరి.)

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ఏడవ శ్లోకమున ఆదిదేవుని సమగ్రమూర్తి దర్శనమును, ఎనిమిదవ శ్లోకమున ఆయన భంగిమయు వర్ణింపబడినవి. ఇటనుండి ఆయన అంగ, అంబర, ఆభరణ, ఆయుధ, వాహనాదికము క్రమముగా వర్ణింపబడును. యోగనిద్రనుండి మేల్కాంచిన ఆ దేవుడు శరత్కాలపు దినమువలె నుండెనట. ఆయునకు శరద్దివసమునకు సమాన ధర్మములు శ్లేషచే స్థాపింపబడినవి.

ఆయన వికసించిన తెల్లతామరలవంటి కన్నులు గలవాడు. శరద్దినము వికసించిన తెల్లతామరలే కన్నులుగా గలది. ఆయన బాలాతపమువంటి అంశుకము గలవాడు. అది బాలాతపమే అంశుకముగా గలది. ఆయన ప్రకృష్టములైన యుద్యమములు గల యోగులకు సుఖముగా దర్శింపదగినవాడు. అది ప్రారంభమున సుఖముగా దర్శింపదగినది. ఇట్లు అర్థశ్లేషవల్ల సమాన ధర్మములు రూపింపబడినవి. ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు శ్రీ మహావిష్ణువు నిద్రాగతుడగును. కార్తీక శుద్ధ ఏకాదశినాడు మేల్కాంచును. ఆయన మేల్కాంచుట శరదృతువున. కనుక మేల్కాంచి యున్న ఆయనను శరద్దినముతో పోల్చుట పరమోచితముగా నున్నది. రావణ సంహారమునకు ఆయనను పురికొల్ప వచ్చిన దేవతలకు ఆయన వీరరసానుకూలమైన శరద్దినమువలె తోచినట్లు వర్ణించుట స్వభావ సుందరముగా నున్నది.

శ్లో॥ ప్రభానులిప్త శ్రీవత్సం
లక్ష్మీ విభ్రమ దర్పణం
కౌస్తుభాఖ్య మపాం సారం
బిభ్రాణం బృహతోరసా. 10

పద విభాగము : ప్రభానులిప్త శ్రీవత్సం, లక్ష్మీ విభ్రమ దర్పణం, కౌస్తుభాఖ్యం, అపాం, సారం, బిభ్రాణం, బృహతా, ఉరసా.

అన్వయము : ప్రభానులిప్త శ్రీవత్సం లక్ష్మీ విభ్రమ దర్పణం కౌస్తుభాఖ్యం అపాం సారం బృహతా ఉరసా బిభ్రాణం -

అర్థము : ప్రభా = కాంతిచేత; అను లిప్త = అనురంజితము చేయబడిన; శ్రీవత్సం = శ్రీవత్స మను గుర్తు గలది; లక్ష్మీ = లక్ష్మీ దేవికి; విభ్రమ = విలాసము కొఱకైన; దర్పణం = అద్దమైనది; కౌస్తుభ + ఆఖ్యం = కౌస్తుభ మను పేరు గలది యైన; అపాం = నీటియొక్క; సారం = సారభూతమైన మణిని; బృహతా = విశాలమైన; ఉరసా = వక్షఃస్థలముచే; బిభ్రాణం = ధరించుచున్న వానిని - (తం దదృశుః అని యన్వయము.)

తాత్పర్యము : తన కాంతిచే అనురంజితము చేయబడిన శ్రీవత్స మనెడు మచ్చ గలది, లక్ష్మీదేవికి విలాసార్థమైన దర్పణమైనది, జలముయొక్క సారమైనది యగు కౌస్తుభ మను పేరు గల మణిని విశాలమైన వక్షమున ధరించిన వానిని - (విష్ణువును దర్శించిరి.)

వ్యాఖ్యానము : విష్ణువు వక్షఃస్థలమున గల మచ్చ పేరు శ్రీవత్సము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నెవ్వడు ముక్తి నీయగలవాడు అని మునులకు సంశయము గలుగగా ఆ యంశమును నిర్ణయించుటకు భృగువు అను మహర్షి బయలుదేరెను. ఆతడు బ్రహ్మకడకేగి ఆయన యానతీయక ముందే ఆసనమున గూర్చుండెను. బ్రహ్మకు గోపము వచ్చెను. రజోగుణ ప్రధానుడవైన నీకు పూజ లేకుండు గాక యని బ్రహ్మను శపించి భృగువు శివునికడకేగెను. తాను పార్వతితో వినోదించుచుండగా వచ్చిన భృగువుపై శివుడు కోపించెను. నీవు తమోగుణ ప్రధానుడవు గనుక నీ రూపమునకు బూజ లేకుండు గాక యని భృగువు శివుని శపించి విష్ణువుకడకు బోయెను. తన వక్షఃస్థలమందున్న లక్ష్మిని క్రిందికి దింపి విష్ణువు లేచి భృగువును గౌరవించెను. భృగువు విష్ణువు వక్షఃస్థలమును కాలితో తాచెను. అచ్చట కంది మచ్చ యేర్పడెను. అయినను విష్ణువు కోపము తెచ్చికోలేదు. సత్వగుణ ప్రధానుడైన విష్ణువే మోక్ష మీయగలవాడని భృగువు నిర్ణయించెను. భృగువు తన్నగా నేర్పడిన మచ్చయే శ్రీవత్సము. సముద్ర మథనమున లభించిన కౌస్తుభము అను మణిని విష్ణుదేవుడు వక్షమున నలంకరించుకొనెను. లక్ష్మీదేవి విష్ణుని వక్షఃస్థలమునందుండును గదా. ఆమె యలంకరించు

కొని కౌస్తుభమణియందు తన యందమును జూచుకొనుచుండును. తళతళలాడు కౌస్తుభమణినుండి వెలువడు కాంతులు శ్రీవత్సముపై ప్రసరించి దానికిని వన్నె చేకూర్చుచుండును.

విష్ణుని పాదములను తన యంకమునం దుంచుకొని పద్మాసీనయై యున్న లక్ష్మి ఆయన వక్షఃస్థలమునందున్న కౌస్తుభమణియందు తన ప్రతిబింబమును జూచుకొనుచుండ నా దేవతలు విష్ణువును దర్శించిరని యభిప్రాయము.

శ్లో॥ బాహుభిర్విటపాకారై
ర్దివ్యాభరణ భూషితైః
ఆవిర్భూత మపాం మధ్యే
పారిజాత మివాపరం. 11

పద విభాగము : బాహుభిః, విటపాకారైః, దివ్యాభరణ భూషితైః, ఆవిర్భూతం, అపాం, మధ్యే, పారిజాతం, ఇవ, అపరం.

అన్వయము : విటపాకారైః దివ్యాభరణ భూషితైః బాహుభిః అపాం మధ్యే ఆవిర్భూతం అపరం పారిజాతం ఇవ (స్థితం)–

అర్థము : విటప = శాఖలయొక్క; ఆకారైః = రూపముగలవి; దివ్య = దేవతా సంబంధమైన; ఆభరణ = అలంకారములచే; భూషితైః = అలంకరింపబడినవి అయిన; బాహుభిః = బాహువులతో; అపాం = జలములయొక్క; మధ్యే = నడుమ; ఆవిర్భూతం = పుట్టిన; అపరం = రెండవదైన; పారిజాతం–ఇవ = కల్పవృక్షమా యన్నట్లు; స్థితం = ఉన్నవానిని ( తం దదృశుః అని యన్వయము).

తాత్పర్యము : శాఖలవలె నున్నవి దివ్యములైన యాభరణములచే నలంకరింపబడినవియైన బాహువులతో సముద్రజలము నడుమ పుట్టిన రెండవ కల్పవృక్షమా యన్నట్లు ఉన్నవానిని (విష్ణువును దర్శించిరి).

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : విష్ణుదేవుని చతుర్బాహువులు నానా విధములైన దివ్యాభరణములచే నలంకృతములై కల్పవృక్ష శాఖలవలె నుండెను. ఆయనను చూడగనే దేవతలకు సముద్రమునుండి యావిర్భవించిన కల్పవృక్షము స్ఫురణకు వచ్చెను. సాలంకారములైన చతుర్భుజములతోడి శ్రీ మహావిష్ణువు శాఖా చతుష్టయము తోడి కల్పవృక్షముగా వారి భావనకు గోచరమయ్యెను. విష్ణువు ఉపమేయము, కల్పవృక్షము ఉపమానము. ఉపమేయము ఉపమానముగా సంభావింపబడుటచే ఉత్ప్రేక్ష - వస్తూత్ప్రేక్ష. సాగర మధ్యము నందున్న విష్ణువు సాగరావిర్భూతమైన కల్పవృక్షముగా ఉత్ప్రేక్షింప బడుట సహజము, ఔచిత్య శోభితము. వైకుంఠమం దున్నప్పుడు విష్ణువునం దీయుత్ప్రేక్ష యస్వాభావిక మగును.

'అపరం పారిజాతం' అనుటచే విష్ణువునందు పారిజాతత్వారోపణ ముండుటచే రూపకము కలదు. అభేదత్వారోపణ సహితమైన ఉపమానత్వ సంభావన యుండుటచే ఇచ్చట రూపకోత్ప్రేక్షల సాంకర్యము భావింప దగును. బాహువుల విటపౌపమ్యము, విష్ణుని పారిజాతా భిన్నత్వమున, పారిజాతత్వ సంభావనమున పర్యవసించినట్లు గ్రహింపవలెను.

శ్లో॥ దైత్యస్త్రీ గండలేఖానాం
మదరాగ విలోపిభిః
హేతిభి శ్చేతనావద్భి
రుదీరిత జయస్వనమ్. 12

పద విభాగము : దైత్యస్త్రీ గండలేఖానాం, మదరాగవిలోపిభిః, హేతిభిః, చేతనావద్భిః, ఉదీరిత జయస్వనం.

అన్వయము : దైత్యస్త్రీ గండలేఖానాం మదరాగ విలోపిభిః చేతనావద్భిః హేతిభిః ఉదీరిత జయస్వనం.

అర్థము : దైత్య-స్త్రీ = రాక్షస స్త్రీల; గండ-లేఖానాం = చెక్కిలి ప్రదేశముల యొక్క; మద-రాగ-విలోపిభిః = మదమువల్ల గలిగిన యెఱ్ఱదనమును లోపింపజేయునవి; చేతనావద్భిః = చైతన్య శక్తి గలవి యైన; హేతిభిః = ఆయుధ

ములచేత; ఉదీరిత = ఉద్ఘోషింప బడిన; జయస్వనం = జయశబ్దము గలవానిని-(తం దదృశుః అని యన్వయము)

తాత్పర్యము : రాక్షస స్త్రీలయొక్క చెక్కిళ్ల యందుగల మదముచే గలిగిన రక్తిమను లోపింప జేయునవి, చైతన్య శక్తి గలవి యైన సుదర్శనాద్యాయుధములచే ఉద్ఘోషింప బడిన జయ జయ ధ్వనులు గలవానిని (విష్ణువును దర్శించిరి).

అలంకారము : పర్యాయోక్తము.

వ్యాఖ్యానము : విష్ణుదేవుని సుదర్శనాద్యాయుధములు సచేతనములు. ఆయన చిత్తము ననుసరించి యవి స్వయముగా క్రియావంతము లగును. దేవతలు విష్ణువును దర్శింప వచ్చిన సమయమునకు అవి జయ జయ శబ్దములు చేయుచున్నవి. యోగ నిద్రనుండి మేల్కాంచిన విష్ణువు దైత్య సంహారోద్యుక్తుడగునని వానికి ఎఱుకయే. అవి జయ శబ్దము చేయుచుండగా దేవతలు వచ్చుటచే దేవకార్యము ఫలించునని శుభ సూచన. దైత్య స్త్రీల గండస్థలము లందలి మద రాగమును లోపింపజేయునవి అని ఆయుధములు చేయు కార్యము చెప్పబడినది. మదరాగము లోపించుటకు గారణము దైత్య స్త్రీల భర్తలు మరణించుట. ఆయుధములు దైత్యులను చంపి దైత్య స్త్రీల గండములందలి మదరాగము లోపింప జేయును. మదరాగ లోపము చెప్పబడుట ద్వారా దైత్య సంహారము చెప్పక చెప్పబడినది గనుక ఇది పర్యాయోక్తమను నలంకారము. స్త్రీల మదరాగము లోపించును అని దైత్యుల మరణము మృదువుగా చెప్పబడుటచే సౌకుమార్యము అను గుణము కలదు.

విష్ణుమూర్తి ఆయుధములు : సుదర్శనము అను చక్రము, నందకము అను ఖడ్గము, శార్ఙ్గము అను ధనువు, కౌమోదకి అను గద, పాంచజన్యము అను శంఖము - ఇవి విష్ణుదేవుని పంచాయుధములు.

శ్లో॥ ముక్తశేష విరోధేన
కులిశవ్రణ లక్ష్మణా
ఉపస్థితం ప్రాంజలినా
వినీతేన గరుత్మతా. 13

పద విభాగము : ముక్తశేష విరోధేన, కులిశవ్రణ లక్ష్మణా, ఉపస్థితం, ప్రాంజలినా, వినీతేన, గరుత్మతా.

అన్వయము : ముక్తశేష విరోధేన కులిశవ్రణ లక్ష్మణా ప్రాంజలినా వినీతేన గరుత్మతా ఉపస్థితం -

అర్థము : ముక్త = విడువబడిన; శేష = ఆదిశేషుని యందలి; విరోధేన = వైరము గలవాడును; కులిశ = వజ్రాయుధమువలన నైన; వ్రణ = గాయముల; లక్ష్మణా = గుర్తులు గలవాడును; ప్రాంజలినా = దోయిలించినవాడును; వినీతేన = వినయవంతుడును నైన; గరుత్మతా = గరుత్మంతునిచేత; ఉపస్థితం = ఉపాసింపబడుచున్నవానిని - (తం దదృశుః అని యన్వయము.)

తాత్పర్యము : ఆదిశేషునిపట్ల వైరము విడిచినవాడు, వజ్రాయుధమువలన గలిగిన గాయముల గుర్తులు గలవాడు, అంజలి పట్టియున్నవాడు, వినయవంతుడు నైన గరుత్మంతునిచే సేవింపబడుచున్నవానిని - (విష్ణువును దర్శించిరి.)

వ్యాఖ్యానము : గరుత్మంతుడు నాగవైరి. నాగరాజైన శేషునకు గరుడనికి అందువల్ల విరోధము. విష్ణువునకు గరుడడు వాహనము, శేషుడు తల్పము. కనుక ఆయన సేవయం దిరువురును విరోధింపరు. అందుచే గరుడడు శేషునితో మాత్రము వైరము వదలిపెట్టెను. అమృతాపహరణ సందర్భమున ఇంద్రుడు గరుడనిపై వజ్రాయుధము ప్రయోగించెను. అది చేసిన గాయములు గరుడని శరీరమునం దిప్పుడును కనబడుచున్నవి. నిద్ర మేల్కాంచినంతనే దైత్యసంహారమున విష్ణువు ప్రవృత్తుడగునని గరుడనికి డెలియును. కనుక ఆయన తన వాహన కృత్యము నిర్వహింప సిద్ధమై చేతులు జోడించి వినయముతో చేరవచ్చి యున్నాడు. గరుడని పరాక్రమము, ఔదార్యము, వినయము, స్వామిభక్తి చక్కగా చిత్రింపబడినవి. గరుడని సాన్నిహిత్యము కూడ దేవకార్యమునకు శుభసూచనయే.

'వినీతేన' అను విశేషణమును గూర్చిన పూర్వగాథ : ఇంద్రుని సారథియైన మాతలికి గరుడకేశి యను పుత్రిక గలదు. దాని భర్త యొక సర్పము. సర్పములను యథేష్టముగా భుజించుటకు గరుడడు ఇంద్రునిచే వరము పొందియుండుటచే మాతలి తన యల్లునికి గరుడనివలన అపాయము శంకించి విష్ణువును ప్రార్థించి

ఆయనవలన తన యల్లునకు అభయము సంపాదించుకొనెను. తన శత్రువునకు విష్ణువు అభయమిచ్చుట విని గరుడడు మిక్కిలి కోపించి విష్ణువుతో 'నేను నిన్ను మోయుచున్నాను గనుక నీకంటె నేనే బలవంతుడను. నా ప్రతిపక్షుని నీవెట్లు రక్షింతువో చూతును' అని గర్వించి పలికెను. అది విని విష్ణువు నవ్వుచు గరుడని వీపుపై తన ఎడమచేతి చూపుడువ్రేలితో నొక్కెను. గరుడడు ఆ వ్రేలి బరువు సహింపజాలక విలవిలలాడిపోయెను. గర్వభంగమై విష్ణువును శరణువేడి నాటి నుండి వినీతుడయ్యెను.

శ్లో॥ యోగనిద్రాంత విశదైః
పావనై రవలోకనైః
భృగ్వాదీ ననుగృహ్ణంతం
సౌఖశాయనికా న్మునీన్. 14

పద విభాగము : యోగ నిద్రాంతవిశదైః, పావనైః, అవలోకనైః, భృగ్వాదీన్, అనుగృహ్ణంతం, సౌఖశాయనికాన్, మునీన్.

అన్వయము : యోగ నిద్రాంతవిశదైః పావనైః అవలోకనైః సౌఖశాయనికాన్ భృగ్వాదీన్ మునీన్ అనుగృహ్ణంతం –

అర్థము : యోగ = యోగ మనెడు; నిద్రా = నిద్రయొక్క; అంత = అవసానమున; విశదైః = ప్రసన్నములైన; పావనైః = శుద్ధికరములైన; అవలోకనైః = చూపులచేత; సౌఖశాయనికాన్ = సుఖనిద్రనుగూర్చి ప్రశ్నించు; భృగు + ఆదీన్ = భృగువు మొదలుగా గల; మునీన్ = మునులను; అనుగృహ్ణంతం = అనుగ్రహించుచున్నవానిని (తం దదృశుః అని యన్వయము.)

తాత్పర్యము : యోగనిద్రయొక్క అవసానమున ప్రసన్నములై యున్నవి, పావనము చేయునవి యైన చూపులతో సుఖనిద్రనుగూర్చి ప్రశ్నించుచున్న భృగువు మొదలుగా గల ఋషులను అనుగ్రహించుచున్నవానిని – (విష్ణువును దర్శించిరి.)

వ్యాఖ్యానము : నిద్రనుండి మేల్కొనినవాని కన్నులు సాధారణముగా ఎఱుపెక్కి యుండును. విష్ణువు యోగనిద్రనుండి మేల్కొంచి యుండుటచే ఆయన కన్నులు విప్పారిన తెల్లతామరలవలె (ప్రబుద్ధ పుండరీకాక్షం) తేటగా నుండెను.

అందుండి వెలువడు చూపులు నిర్మలములై సర్వమును నిర్మలము చేయుచుండెను. సౌఖశాయనికులై చేరవచ్చిన భృగ్వాది మహర్షులను ఆయన ప్రసన్న వీక్షణము లతో అనుగ్రహించుచుండెను. సౌఖశాయనికు లనగా సుఖశయనమునుగూర్చి ప్రశ్నించువారు. విష్ణువు నిద్రలేచువేళకు భృగ్వాదులు ఆయన దర్శనమునకు వచ్చి సుఖముగా నిద్రచేసినారా యని యడిగిరి. ఇచ్చట 'భృగ్వాదీన్' అనుట వెనుకటి శ్రీవత్స వృత్తాంతమునకు అనుగుణముగా నున్నది. విష్ణువే మోక్షప్రదుడని పరీక్షించి తేల్చి మునులకు తెలియజెప్పినవాడు భృగువే.

ఇంతవఱకు దేవతలు దర్శించిన విష్ణుమూర్తి వైభవము వర్ణింపబడినది. ఇంకమీద వారు కావించిన విష్ణుస్తుతి వర్ణింపబడును.

శ్లో॥ ప్రణిపత్య సురా స్తస్మై
శమయిత్రే సురద్విషామ్
అథైవం తుష్టువు స్స్తుత్య
మవాఙ్మానస గోచరమ్. 15

పద విభాగము : ప్రణిపత్య, సురాః, తస్మై, శమయిత్రే, సురద్విషాం, అథ, ఏవం, తుష్టువుః, స్తుత్యం, అవాఙ్మానసగోచరం.

అన్వయము : అథ సురాః సురద్విషాం శమయిత్రే తస్మై ప్రణిపత్య స్తుత్యం అవాఙ్మానసగోచరం (తం) ఏవం తుష్టువుః.

అర్థము : అథ = అనంతరము; సురాః = దేవతలు; సురద్విషాం = రాక్షసులను; శమయిత్రే = నశింపజేయునట్టి; తస్మై = ఆ విష్ణుదేవునకు; ప్రణిపత్య = ప్రణమిల్లి; స్తుత్యం = స్తుతింపదగిన; అవాఙ్మానసగోచరం = వాక్కునకు, మనస్సునకు గోచరుడు కాని; తం = ఆ విష్ణువును; ఏవం = ఈ విధముగా; తుష్టువుః = స్తుతించిరి.

తాత్పర్యము : దర్శించిన యనంతరము దేవతలు రాక్షసులను నాశము చేయు ఆ విష్ణుదేవునకు ప్రణమిల్లి, స్తుతింపదగినవాడును, వాక్కునకు, మనస్సునకు గోచరము కానివాడును అగు ఆయనను ఈ విధముగా స్తుతించిరి.

వ్యాఖ్యానము : 'శమయిత్రే సురద్విషాం' అనుట సురల కార్యాల ప్రయోజనమునకు అనురూపముగా నున్నది. తమకు శత్రువైన రావణుని నాశమొనర్చుమని కోరుటకే కదా వా రప్పు డచ్చటికి వచ్చినది. 'ప్రణిపత్య' అనగా దేవత లందఱును ఆదిపురుషునకు సాష్టాంగ నమస్కారము గావించి తమ శరణాగతిని వ్యక్తము చేసిరని యర్థము. స్తుతి యనగా గుణియందున్న గుణములను పేర్కొనుట. దేవతలందరు ఏకకంఠమున విష్ణుదేవుని అనంత కల్యాణ గుణములను పేర్కొనిరి. అట్టి గుణములు కలవాడు గనుకనే ఆయన స్తుత్యుడు. ఇంతవఱకును దేవతలకు అక్షిగోచరుడైన యాదిపురుషుని లక్షణములను కాళిదాసు వర్ణించెను. ఇప్పుడు అవాఙ్మానసగోచరుడైన ఆ దేవుని తత్త్వమును దేవతలు వర్ణింప మొదలిడిరి. కాళిదాసు వర్ణించినది దేవుని అర్చార్హమైన రూపము. దేవతలు వర్ణింప బోవుచున్నది ఆయన ధ్యానార్హమైన తత్త్వము. అవాఙ్మానసగోచరుని వర్ణించుట యెట్లనగా శబ్దానుమాన ప్రమాణములచే గమ్యమైనంతవఱకే వర్ణింపసాగిరని గ్రహింపవలెను. స్థూలమైన రూపమును తానై వర్ణించి సూక్ష్మమైన తత్త్వమును దేవతల ముఖమున వర్ణితము చేయుట కాళిదాసు గడుసుదనము.

శ్లో॥ నమో విశ్వసృజే పూర్వం
విశ్వం తదను బిభ్రతే
అథ విశ్వస్య సంహర్త్రే
తుభ్యం త్రేధా స్థితాత్మనే. 16

పద విభాగము : నమః, విశ్వ సృజే, పూర్వం, విశ్వం, తదను, బిభ్రతే, అథ, విశ్వస్య, సంహర్త్రే, తుభ్యం, త్రేధా, స్థితాత్మనే.

అన్వయము : పూర్వం విశ్వ సృజే తదను విశ్వం బిభ్రతే అథ విశ్వస్య సంహర్త్రే (ఏవం) త్రేధా స్థితాత్మనే తుభ్యం నమః.

అర్థము : పూర్వం = మొదట; విశ్వ సృజే = విశ్వమును సృష్టించినట్టియు; తదను = దాని తరువాత; విశ్వం = విశ్వమును; బిభ్రతే = భరించునట్టియు; అథ = అనంతరము; విశ్వస్య = విశ్వముయొక్క; సంహర్త్రే = సంహారకుడవైనట్టియు; (ఏవం = ఈ విధముగా); త్రేధా = మూడు విధములుగా;

స్థిత + ఆత్మనే = ఉన్న స్వరూపము గల; తుభ్యం = నీకు; నమః = నమస్కారము.

తాత్పర్యము : ఆదియందు విశ్వమును సృష్టించినవాడవు, తదనంతరము విశ్వమును భరించువాడవు, అనంతరము విశ్వమును హరించువాడవు నై యిట్లు మూడు విధములుగా నున్న స్వరూపము గల నీకు నమస్కారము.

వ్యాఖ్యానము : ఆదిపురుషుడు త్రిమూర్త్యాత్మకుడని ఈ శ్లోక భావము. ఆయన విష్ణు రూపమున నున్నను, శివ రూపమున నున్నను ఆయన సృష్టిస్థితిలయ కారుడే. కుమారసంభవ షష్ఠ సర్గమున సప్తర్షులు పరమేశ్వరుని స్తుతించుచు -

"కిం యేన సృజసి వ్యక్త ముత యేన బిభర్షి తత్
అథ విశ్వస్య సంహర్తా భాగః కతమ ఏష తే."

అని ప్రశ్నింతురు. సృష్టికర్తవు, భర్తవు, సంహర్తవు నీవే యని దీని తాత్పర్యము. ఇచ్చటి విష్ణు స్తుతి తాత్పర్యము నదియే. వ్యక్తస్థితియందు శివ కేశవులు భిన్నులయ్యు అవ్యక్తస్థితియం దిరువురు నొక్కడే యని కాళిదాసు భావము. త్రిథాస్థితుడవైన నీకు నమస్కారము అన్నప్పుడు అవాఙ్మానసగోచరమైన తత్వమే యుద్దేశింపబడినది.

శ్లో॥ రసాంతరాణ్యేకరసం
యథా దివ్యం పయోఽశ్నుతే
దేశే దేశే గుణేష్వేవ
మవస్థా స్త్వ మవిక్రియః. 17

పద విభాగము : రసాంతరాణి, ఏకరసం, యథా, దివ్యం, పయః, అశ్నుతే, దేశే, దేశే, గుణేషు, ఏవం, అవస్థాః, త్వం, అవిక్రియః.

అన్వయము : ఏకరసం దివ్యం పయః దేశే దేశే రసాంతరాణి యథా అశ్నుతే ఏవం అవిక్రియః త్వం గుణేషు అవస్థాః (అశ్నుషే.)

అర్థము : ఏక-రసం = ఒకే తీయని రుచిగల; దివ్యం = దివమున బుట్టిన; పయః = జలము; దేశే-దేశే = ఆ యా ప్రదేశములందు; రసాంతరాణి = ఇతర

రుచులను; యథా = ఏ విధముగా; అశ్నుతే = పొందునో; ఏవం = అట్లే; అవిక్రియః = నిర్వికారుడవైన; త్వం = నీవు; గుణేషు = సత్వాది గుణములందు; అవస్థాః = రూప భేదములను; (అశ్నుషే = పొందుదువు)

తాత్పర్యము : ఒకే తీయని రుచిగల వర్ష జలము ఆ యా ప్రదేశములందు పడి లవణత్వాదులయిన ఇతర రుచులను ఏ విధముగా పొందునో ఆ విధముగానే ఏకరూపుడవైన నీవు సత్వాదులయిన గుణముల నాశ్రయించి రూప భేదములను పొందుదువు.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ఆకాశమున పుట్టిన జలమునకు రుచి, వర్ణము, గంధము ఉండవు. అది నిర్వికారము. అది యే ద్రవ్యము నాశ్రయించునో ఆ ద్రవ్యము యొక్క రుచి వర్ణ గంధాదులు దానియందున్నట్లు భాసించును. అట్లే పరతత్వము నిర్గుణము. అది సత్వ రజ స్తమో గుణముల నాశ్రయించినప్పుడు విష్ణు, బ్రహ్మ, శివ రూపములుగా భాసించును. బ్రహ్మత్వ, విష్ణుత్వ, శివత్వములు క్రమముగా రజస్సును, సత్వమును, తమస్సును ఆశ్రయించినందువల్ల నిర్గుణము, నిర్వికారము నైన బ్రహ్మ పదార్థమునకు గలిగిన యవస్థా భేదములు మాత్రమే. నిర్గుణమైన బ్రహ్మము అవాఙ్మానసగోచరము. శివ కేశవ భేదము ఉపాధిభేదమువల్ల నేర్పడినదే కాని పారమార్థికము కాదని కాళిదాసు విశ్వాసము.

శ్లో॥ ఏకః కారణత స్తాం తా
మవస్థాం ప్రతిపద్యసే
నానాత్వం రాగసంయోగాత్
స్ఫటికస్యేవ తే ధ్రువమ్. 18

పద విభాగము : ఏకః, కారణతః, తాం, తాం, అవస్థాం, ప్రతిపద్యసే, నానాత్వం, రాగసంయోగాత్, స్ఫటికస్య, ఇవ, తే, ధ్రువం.

అన్వయము : ఏకః (త్వం) కారణతః తాం తాం అవస్థాం ప్రతిపద్యసే; తే నానాత్వం రాగసంయోగాత్ స్ఫటికస్య ఇవ ధ్రువం.

అర్థము : ఏకః = ఏకరూపుడవైన; (త్వం = నీవు); కారణతః = ఉపాధి భేదమువలన; తాం-తాం = ఆ యా; అవస్థాం = రూప భేదమును; ప్రతిపద్యసే = పొందుదువు; తే = నీయొక్క; నానాత్వం = అనేక రూపత్వము; రాగ-సంయోగాత్ = ఎఱ్ఱని ద్రవ్యముల సంపర్కమువలన; స్ఫటికస్య-ఇవ = స్ఫటికముయొక్క నానాత్వమువలెనే అనుట; ధ్రువం = సత్యము.

తాత్పర్యము : ఏకరూపుడవైన నీవు ఉపాధి భేదమువలన ఆ యా రూప భేదములను పొందుచున్నావు. నీ యనేక రూపత్వము రాగద్రవ్య సంపర్కము వలన నైన స్ఫటికముయొక్క నానావర్ణత్వమువంటిదే యనుట తథ్యము.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : వెనుకటి శ్లోకమున దేశభేదమునుబట్టి జలమునకు రుచి భేదము కలుగుట ఉపమానముగా గ్రహింపబడినది. ఈ శ్లోకమున భిన్నవర్ణములు గల ద్రవ్యములతోడి సంయోగమువల్ల స్ఫటికమునకు వర్ణభేదములు కలుగుట ఉపమానముగా గ్రహింపబడినది. రెండింటను ఉపమేయము (ప్రకృత విషయము) ఏకరూపైన బ్రహ్మమునకు ఉపాధి భేదమువలన అవస్థా భేదము కలుగుటయే. ఈ శ్లోకముయొక్క అర్థము వెనుకటి శ్లోకముయొక్క అర్థముకంటె భిన్నము కాదు కనుక పునరుక్తి యగుచున్నది. ఇందువల్ల మల్లినాథ సూరి ఈ శ్లోకమును ప్రక్షిప్తముగా పరిగణించెను.

శ్లో॥ అమేయో మితలోకస్త్వ
మనర్థీ ప్రార్థనావహః
అజితో జిష్ణు రత్యంత
మవ్యక్తో వ్యక్త కారణమ్. 19

పద విభాగము : అమేయః, మితలోకః, త్వం, అనర్థీ, ప్రార్థనావహః, అజితః, జిష్ణుః, అత్యంతం, అవ్యక్తః, వ్యక్తకారణం.

అన్వయము : త్వం అమేయః మితలోకః; అనర్థీ ప్రార్థనావహః; అజితః జిష్ణుః; అత్యంతం అవ్యక్తః వ్యక్తకారణం.

అర్థము : త్వం = నీవు; అమేయః = ఇంతవాడవని చెప్ప శక్యము గాని వాడవు; మిత-లోకః = పరిచ్ఛిన్నమైన లోకము గలవాడవు; అనర్థీ = కోరిక లేని వాడవు; ప్రార్థనా-ఆవహః = కోరికల నిచ్చువాడవు; అజితః = జయింపబడని వాడవు; జిష్ణుః = జయించు శీలము గలవాడవు; అత్యంతం = మిక్కిలి; అవ్యక్తః = సూక్ష్మరూపుడవు; వ్యక్తకారణం = స్థూలమైన జగత్తునకు హేతువైనవాడవు.

తాత్పర్యము : నీవు ఇంతని చెప్పరానివాడవు, లోకమునకు పరిమితి కలిగించినవాడవు; కోరికలు లేనివాడవు, కోరికల నిచ్చువాడవు; జయింపబడనివాడవు, జయించు శీలము గలవాడవు; మిక్కిలి సూక్ష్మరూపుడవు, స్థూలమైన జగత్తునకు కారణమైనవాడవు.

వ్యాఖ్యానము : బ్రహ్మము ఇంతటిది అని లోకము తెలిసికోజాలదు. లోకము ఇంతటిది అని బ్రహ్మమునకు తెలియును. అనగా బ్రహ్మము అపరిమితము, లోకము పరిమితము-వ్యక్తము పరిమితము, అవ్యక్తము అపరిమితము. బ్రహ్మము పూర్ణకామము, కోరికలు లేనిది. సర్వము తనయందే కలది. సర్వము కలది గనుక అందరు తన్ను ప్రార్థించునట్లు చేయునది. బ్రహ్మము అనంత శక్తి సంపన్నము కనుక దానిని జయించువాడెవ్వడును లేడు. సృష్టియందలి సర్వము పరిమితశక్తి గలదే కనుక బ్రహ్మము సర్వమును జయించగలదు. బ్రహ్మము అవ్యక్తము-వ్యక్తమైన సర్వమునకు కారణము. వ్యక్తమైనదెల్ల నశించుచున్నది. అనగా మరల అవ్యక్తమగుచున్నది. కనుక వ్యక్తమైనదానికి కారణమైనది అవ్యక్తము. వ్యక్తమైన సృష్టి అనిత్యము, అవ్యక్తమైన బ్రహ్మము నిత్యము.

శ్లో॥ హృదయస్థ మనాసన్న
మకామం త్వాం తపస్వినమ్
దయాళు మనఘస్పృష్టం
పురాణ మజరం విదుః. 20

పద విభాగము : హృదయస్థం, అనాసన్నం, అకామం, త్వాం, తపస్వినం, దయాళుం, అనఘస్పృష్టం, పురాణం, అజరం, విదుః.

అన్వయము : త్వాం హృదయస్థం అనాసన్నం అకామం తపస్వినం దయాళుం అనఘస్పృష్టం పురాణం అజరం విదుః.

అర్థము : త్వాం = నిన్ను; హృదయస్థం = హృదయమందున్నవానినిగా; అనాసన్నం = సమీపస్థుడవు కానివానినిగా; అకామం = కోరికలు లేనివానినిగా; తపస్వినం = తపస్సు చేయువానినిగా; దయాళుం = దయగలవానినిగా; అనఘ స్పృష్టం = దుఃఖముచే స్పృశింపబడనివానినిగా; పురాణం = చిరంతనునిగా; అజరం = క్షయము లేనివానినిగా; విదుః = ఎఱుగుదురు.

తాత్పర్యము : సర్వాంతర్యామి యయ్యు సమీపస్థుడు కానివాడనియు, కోరికలు లేనివాడయ్యు తపస్సు గావించువాడనియు, దయాళువయ్యు దుఃఖస్పర్శ లేనివాడనియు, చిరంతనుడయ్యు క్షయము లేనివాడనియు విద్వాంసులు నిన్ను ఎఱుంగుదురు.

అలంకారము : విరోధాభాసము.

వ్యాఖ్యానము : వ్యక్తము నీవే, అవ్యక్తము నీవే, కార్యము నీవే, కారణము నీవే–ఈ విధముగా బ్రహ్మమునుగూర్చి చెప్పు మాటలు పరస్పర విరుద్ధములుగా నుండును. వీనియందు విరోధము నిజముగా లేదు. ఉన్నట్లు కనబడును. వినగానే విరోధమున్నట్లు తోచినను విచారించిన మీదట విరోధము లేనట్లు స్పష్టపడును. కనుక ఈ శ్లోకమున విరోధాభాసమున్నది. ఉన్నట్లు కనబడిన విరోధము శ్లేషాదులవల్ల తొలగిపోయినచో విరోధాభాసాలంకారమనుట పరిపాటి. ఈ వాక్యమున శ్లేష లేదు. శ్లేష లేని విరోధాభాసమునకు చమత్కారము లేదు. కాళిదాసు ఈవాక్యము నిట్లు వ్రాయుట పరమేశ్వరుని యలౌకిక మహిమను ప్రతిపాదించుటకే కాని చమత్కృతికొఱకు కాదు. భగవంతుడు సర్వాంతర్యామి యయ్యు నెవ్వరికిని ఆసన్నుడు కాడు అనుటయందు విరోధమున్నది గాని వాక్యార్థము సత్యమే కనుక నిజమునకు విరోధము లేదు. విరోధాభాసమున్నది. ఈ విరోధాభాసము పరమార్థ ప్రతిపాదనకొఱకే కాని చమత్కారముకొఱకు కాదు గనుక అలంకారత్వము చింత్యము.

శ్లో॥ సర్వజ్ఞ స్త్వ మవిజ్ఞాత
స్సర్వయోని స్త్వ మాత్మభూః
సర్వప్రభు రనీశ స్త్వ
మేక స్త్వం సర్వరూపభాక్. 21

పద విభాగము : సర్వజ్ఞః, త్వం, అవిజ్ఞాతః, సర్వయోనిః, త్వం, ఆత్మభూః, సర్వప్రభుః, అనీశః, త్వం, ఏకః, త్వం, సర్వరూపభాక్.

అన్వయము : త్వం సర్వజ్ఞః, అవిజ్ఞాతః; త్వం సర్వయోనిః ఆత్మభూః; త్వం ప్రభుః అనీశః; త్వం ఏకః సర్వరూపభాక్.

అర్థము : త్వం = నీవు; సర్వజ్ఞః = సర్వము దెలిసినవాడవు; అవిజ్ఞాతః = ఎవ్వరికి దెలియబడనివాడవు; త్వం = నీవు; సర్వ-యోనిః = సర్వమునకు జన్మస్థానము; ఆత్మ-భూః = స్వయముగా జన్మించినవాడవు; త్వం = నీవు; ప్రభుః = సర్వమునకు అధికారివి; అనీశః = అధికారి లేనివాడవు; త్వం = నీవు; ఏకః = ఒక్కడవు; సర్వ-రూపభాక్ = సర్వ స్వరూపములు పొందువాడవు.

తాత్పర్యము : నీవు సర్వము నెఱింగినవాడవు. ఎవ్వరికి ఎఱుగబడనివాడవు; నీవు సర్వమునకు జన్మకారణమవు. స్వయముగా జన్మించినవాడవు; నీవు సర్వమునకు ఈశ్వరుడవు, ఈశ్వరుడు లేనివాడవు; నీవు ఒక్కడవు, నానారూపములు ధరించువాడవు.

వ్యాఖ్యానము : 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనుటచే బ్రహ్మము జ్ఞానమే. జ్ఞానమునకు దెలియని దేదియు నుండదు గనుక అఖండ జ్ఞానమైన బ్రహ్మము సర్వజ్ఞము. అది తనకు దప్ప అన్యమునకు జ్ఞాతము కాదు. బ్రహ్మము సర్వమునకు కారణము. బ్రహ్మమే విష్ణువు గనుక విష్ణువు తనకు తానే కారణము. బ్రహ్మము సర్వశక్తిమంతము గనుక విష్ణువు సర్వమునకు ప్రభువు. ఆయన సర్వమునకు ప్రభువు గనుక ఆయనకు ప్రభువు లేడు. యథార్థముగా ఉన్నది ఆయన యొక్కడే కనుక ఉన్నట్లు కనబడుచున్న రూపములన్నియు ఆయన ధరించుచున్నవే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" ఇత్యాద్యుపనిషద్వాక్యము లిట స్మరింపవలెను.

శ్లో॥ సప్తసామోపగీతం త్వాం
సప్తార్ణవ జలేశయమ్
సప్తార్చిర్ముఖ మాచఖ్యుః
సప్తలోకైక సంశ్రయమ్. 22

పద విభాగము : సప్తసామోపగీతం, త్వాం, సప్తార్ణవజలేశయం, సప్తార్చిర్ముఖం, ఆచఖ్యుః, సప్తలోకైక సంశ్రయం.

అన్వయము : త్వాం సప్తసామోపగీతం సప్తార్ణవజలేశయం సప్తార్చిర్ముఖం సప్తలోకైక సంశ్రయం ఆచఖ్యుః.

అర్థము : త్వాం = నిన్ను; సప్త = ఏడు విధములైన; సామ = సామములచేత; ఉపగీతం = కీర్తింపబడుచున్నవానినిగాను; సప్త = ఏడు; అర్ణవ = సముద్రముల; జలే = జలమునందు; శయం = శయనించువానినిగాను; సప్తార్చిర్ముఖం = అగ్నియే ముఖముగా గలవానినిగాను; సప్త = ఏడైన; లోక = లోకములకు; ఏక = ముఖ్యమైన; సంశ్రయం = ఆశ్రయమైనవానినిగాను; ఆచఖ్యుః = చెప్పుదురు.

తాత్పర్యము : నిన్ను ఏడు విధములయిన సామములచే గుర్తింపబడుచున్నవానినిగాను, ఏడు సముద్రముల జలమునందు శయనించువానినిగాను, సప్తార్చియైన యగ్నియే ముఖముగా గలవానినిగాను, ఏడు లోకములకు ప్రధానమైన యాశ్రయమైనవానినిగాను చెప్పుదురు.

వ్యాఖ్యానము : భగవంతుని తత్వమును స్తుతించునవి ఋక్కులు. ఋక్కులలో గానము చేయబడువానికి సామములని పేరు. సర్వాంతర్యామియైన భగవంతుని గూర్చి సామములు గానము చేయును. విష్ణువు సామగానలోలుడని ప్రసిద్ధి. రథంతర మున్నగు సామములు పెక్కు కలవు. వానిలో ముఖ్యమైనవి సప్త సామములు. అవి :- గాయత్ర, రథంతర, వామదేవ్య, బృహత్సామ, వైరూప, వైరాజ, శక్వరీ, రేవతీ, యజ్ఞాయజ్ఞీయ, రాజన, సర్వసామములని పదునొకండు విధములు. వీనిలో రథంతర మున్నగు ముఖ్యములయిన ఏడు సామములచే ఆదిపురుషుడు స్తుతింపబడునని గ్రహింపవలెను. భంగ్యంతరమున సామములు ఏడు విధములు - హింకార, ప్రణవ, ఉద్గీథ, ప్రస్తావ, ప్రతిహార, ఉపద్రవ, నిధనములు. ఈ యేడింటికి సాప్తభక్తికము అని పేరు. ఇవి పృథ్వి, అగ్ని, అంతరిక్షాదుల స్తుతులందు ఉపయోగింపబడును.

విష్ణువు నారములు (నీరములు) అయనముగా గలవాడు గనుక ఆయనకు నారాయణుడని పేరు. విష్ణువు సాగరశయనుడు. సాగరములు ఏడు - లవణ,

ఇక్షు, సురా, సర్పిస్, దధి, క్షీర, జల సముద్రములు. సప్తార్చి యనగా ఏడు జ్వాలలు గల అగ్ని. ఈ జ్వాలలే జిహ్వలనబడును. అగ్నియొక్క సప్తజిహ్వలు- కరాళి, ధూమిని, శ్వేత, లోహిత, నీలలోహిత, సువర్ణ, పద్మరాగ. మరియొక తీరున ఇవి – కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరూపిణి అని యేడు. "అగ్నిముఖా వై దేవాః" అనుటచే ఆదిదేవుడైన విష్ణువు అగ్నిముఖుడు. అగ్నిముఖమున హవిస్సులను గ్రహించువాడు. కనుక ఏడు విధములయిన అగ్నిజ్వాలలు విష్ణువు ఏడు ముఖములు, లేక ఏడు జిహ్వలు. లోకములు మూడని, ఏడని, పదునాల్గని భిన్న విధములుగా పరిగణింపబడినవి. సప్తలోకములు – భూః, భువః, సువః, మహః, జన, తపః, సత్యలోకములు. ఈ లోకములన్నియు విష్ణువు నాశ్రయించి యుండును. ఇట్టి విష్ణువు అవాఙ్మానస గోచరుడు.

శ్లో॥ చతుర్వర్గ ఫలం జ్ఞానం
కాలావస్థా చతుర్యుగా
చతుర్వర్ణమయో లోకః
త్వత్తస్సర్వం చతుర్ముఖాత్. 23

పద విభాగము : చతుర్వర్గ ఫలం, జ్ఞానం, కాలావస్థా, చతుర్యుగా, చతుర్వర్ణమయః, లోకః, త్వత్తః, సర్వం, చతుర్ముఖాత్.

అన్వయము : చతుర్వర్గఫలం జ్ఞానం చతుర్యుగా కాలావస్థా చతుర్వర్ణ మయః లోకః సర్వం చతుర్ముఖాత్ త్వత్తః (జాతం)

అర్థము : చతుర్వర్గ ఫలం = నాల్గు విధములయిన పురుషార్థములే ప్రయోజనముగా గల; జ్ఞానం = జ్ఞానము; చతుర్యుగా = నాలుగు యుగములు గల; కాలావస్థా = కాల పరిణామము; చతుర్వర్ణమయః = నాలుగు వర్ణములు ప్రధానముగా గల; లోకః = లోకము; సర్వం = ఇది యంతయు; చతుర్ముఖాత్ = చతుర్ముఖరూపివైన; త్వత్తః = నీవలననే; (జాతం = పుట్టినది.)

తాత్పర్యము : చతుర్విధ పురుషార్థములే ఫలముగాగల జ్ఞానము, చతుర్యుగములు గల కాలవ్యవస్థ, చాతుర్వర్ణ్యము ప్రధానముగా గల లోకము-ఈ సర్వము చతుర్ముఖబ్రహ్మ స్వరూపుడవైన నీవలననే జన్మించినది.

వ్యాఖ్యానము : ధర్మము, అర్థము, కామము, మోక్షము నను నాల్గు విధములైన పురుషార్థములు ఫలముగాగల జ్ఞానము విష్ణువునుండియే కలుగును. నారము అనగా జ్ఞానము. నారమునకు నెలవైనవాడు గనుక విష్ణువు నారాయణుడు అనబడును. కృతము, త్రేత, ద్వాపరము, కలి అను నాల్గు యుగములుగా విభక్తమై యున్న కాలమునకు విష్ణువే ఆధారము. అఖండమైన కాలము విష్ణు స్వరూపము. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను నాలుగు వర్ణములుగా విభక్తమైన మానవకోటి యంతయు విష్ణువు స్వరూపమే. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః" అను గీతా వచనమునుబట్టి గుణము, కర్మ అనువానినిబట్టి నాలుగు వర్ణములుగా నేర్పడిన మానవకోటి విష్ణువునుండియే పుట్టినది. ఇట్లు మానవకోటి పుట్టుకకు కారణమైన విష్ణువు చతుర్ముఖుడు - అనగా బ్రహ్మ. అవాఙ్మానసగోచరమైన విష్ణువు తత్వమే సృష్టిచేయుటకై చతుర్ముఖబ్రహ్మ రూపము ధరించినదని భావము. నాల్గు విధములుగా విభక్తమై కనబడుచున్న జ్ఞానము, కాలము, లోకము చతుర్ముఖ రూపము దాల్చిన నీవల్లనే పుట్టుచున్నవి. చూ. 16వ శ్లోకము.

శ్లో॥ అభ్యాస నిగృహీతేన
మనసా హృదయాశ్రయమ్
జ్యోతిర్మయం విచిన్వంతి
యోగిన స్త్వాం విముక్తయే. 24

పద విభాగము : అభ్యాస నిగృహీతేన, మనసా, హృదయాశ్రయం, జ్యోతిర్మయం, విచిన్వంతి, యోగినః, త్వాం, విముక్తయే.

అన్వయము : అభ్యాస నిగృహీతేన మనసా యోగినః హృదయాశ్రయం జ్యోతిర్మయం త్వాం విముక్తయే విచిన్వంతి.

అర్థము : అభ్యాస = అభ్యాసముచేత; నిగృహీతేన = నిగ్రహింపబడిన; మనసా = మనస్సుతో; యోగినః = యోగులు; హృదయ + ఆశ్రయం = హృదయమే ఆశ్రయముగా గల; జ్యోతిర్మయం = జ్యోతిస్స్వరూపుడవైన; త్వాం = నిన్ను; విముక్తయే = మోక్షముకొఱకు; విచిన్వంతి = అన్వేషింతురు.

తాత్పర్యము : యోగాభ్యాసముచే నిగ్రహింపబడిన మనస్సుతో తమ హృదయమందే యున్న జ్యోతిస్స్వరూపుడవైన నిన్ను యోగులు మోక్షార్థము అన్వేషింతురు.

వ్యాఖ్యానము : అభ్యాసము అనగా యోగాభ్యాసము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులు అను నెనిమిదియు యోగాంగములు. వీని సక్రమ నిరంతరాభ్యాసమువల్ల యోగము సిద్ధించును. యోగమనగా చిత్తవృత్తి నిరోధము - మనస్సుయొక్క యేకాగ్రత. ఏకాగ్రమైన చిత్తముతో యోగులు సర్వాంతర్యామియైన భగవంతుని తమ హృదయములందే యన్వేషింతురు. "హృత్పద్మే గోళకే స్థితం" అని చెప్పబడిన పరంజ్యోతియే నారాయణుడు. ఆ నారాయణుడే ఆత్మ. ఆత్మదర్శనము ముక్తిహేతువు. "నారాయణ పరంజ్యోతి రాత్మా నారాయణః పరః" ఇత్యాది శ్రుతి వాక్యముల సారము ఈ శ్లోకమున చెప్పబడినది.

శ్లో॥ అజస్య గృహ్ణతో జన్మ
నిరీహస్య హతద్విషః
స్వపతో జాగరూకస్య
యాథార్థ్యం వేద కస్తవ ? 25

పద విభాగము : అజస్య, గృహ్ణతః, జన్మ, నిరీహస్య, హతద్విషః, స్వపతః, జాగరూకస్య, యాథార్థ్యం, వేద, కః, తవ.

అన్వయము : అజస్య జన్మ గృహ్ణతః నిరీహస్య హతద్విషః స్వపతః జాగరూకస్య తవ యాథార్థ్యం కః వేద.

అర్థము : అజస్య = జన్మింపనివాడవు; జన్మ = జన్మమును; గృహ్ణతః = స్వీకరించువాడవు; నిరీహస్య = నిష్కాముడవు; హత-ద్విషః = సంహరింపబడిన శత్రువులు గలవాడవు; స్వపతః = నిద్రించువాడవు; జాగరూకస్య = మేల్కొని యున్నవాడవు ఐన; తవ = నీయొక్క; యాథార్థ్యం = తత్వము; కః = ఎవడు; వేద = ఎఱుగును.

తాత్పర్యము : జన్మ లేనివాడవయ్యు జన్మ స్వీకరించువాడవు, నిష్కాముడవయ్యు శత్రు సంహారకుడవు, నిద్రితుడవయ్యు జాగృతుడవునైన నీయొక్క తత్త్వము నెవ్వ రెఱుంగగలడు ?

వ్యాఖ్యానము : ఆదిపురుషుని మహిమను గూర్చిన యంశములు పరస్పర విరుద్ధములుగా నుండియు పరమార్థములే. ఆయన జన్మ లేనివాడు. కాని ఆ యా సందర్భములందు లోకరక్షణార్థము మత్స్యాది రూపములతో జన్మ స్వీకరించును. ఆయనకు కోరికలు లేవు. లోకకల్యాణార్థము శత్రువులను సంహరించును. ఆయన నిద్రించుచుండియు మేల్కాంచి యుండును - అది యోగనిద్ర గనుక. సర్వసాక్షియైన ఆయన నిద్ర పైకి నిద్రవలె కనబడినను యథార్థమునకు అది సమాధి గనుక జాగృతియే. ఈ విధముగా విపరీతములయిన లక్షణములు గల ఆదిపురుషుని పరమార్థ మెవ్వ రెరుగగలరు ? చాతుర్మాస్యములందాయన నిద్రించుచుండునని యనుకొందుము. కాని ఆయన మేల్కానియే యుండును. దేవతల కా విషయము కొంత తెలియును.

శ్లో॥ శబ్దాదీన్ విషయాన్ భోక్తుం
చరితుం దుశ్చరం తపః
పర్యాప్తోఽసి ప్రజాః పాతు
మౌదాసీన్యేన వర్తితుమ్. 26

పద విభాగము : శబ్దాదీన్, విషయాన్, భోక్తుం, చరితుం, దుశ్చరం, తపః, పర్యాప్తః, అసి, ప్రజాః, పాతుం, ఔదాసీన్యేన, వర్తితుం.

అన్వయము : శబ్దాదీన్ విషయాన్ భోక్తుం, దుశ్చరం తపః చరితుం, ప్రజాః పాతుం, ఔదాసీన్యేన వర్తితుం పర్యాప్తః అసి.

అర్థము : శబ్దాదీన్ = శబ్దము మొదలుగా గల: విషయాన్ = ఇంద్రియార్థములను; భోక్తుం = అనుభవించుటకు; దుశ్చరం = చేయ శక్యముగాని; తపః = తపస్సును; చరితుం = చేయుటకు; ప్రజాః = ప్రజలను; పాతుం = రక్షించుటకు; ఔదాసీన్యేన = తటస్థభావముతో; వర్తితుం = వర్తించుటకు; పర్యాప్తః = సమర్థుడవు; అసి = అగుచున్నావు.

తాత్పర్యము : శబ్దము మున్నగు ఇంద్రియార్థముల ననుభవించుటకు, చేయ శక్యముగాని తపస్సు చేయుటకు, ప్రజలను పాలించుటకు, తటస్థ భావముతో ప్రవర్తించుటకు నీవు సమర్థుడ వగుచున్నావు.

వ్యాఖ్యానము : లోకముతోడి యంటు లేక తటస్థముగా నుండుట విష్ణువు సహజ లక్షణము. ఐనను ఆయన ఆయా యవతారములు ధరించినప్పుడు జీవ లక్షణములు పొంది విషయానుభవములందు ఆసక్తుడగును. మత్స్యాదులు, వామనాదులు నైన యవతారములందు ఆయన శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడు పంచభూత గుణములను అనుభవించును. 'కృష్ణాది రూపేణ' అని మల్లినాథ సూరి యన్న మాట చింత్యము. రామావతారము ఇంకను జరుగవలసి యున్నది. ఈ స్థితిలో దేవతల చిత్తమున కృష్ణాద్యవతారములు స్ఫురించుట సమంజసము కాదు. విష్ణువు స్వార్థము లేకున్నను లోక కల్యాణార్థము తపస్సు చేయును. నరనారాయణ రూపమున ఘోర తపస్సు గావించెనుగదా. పెక్కు పర్యాయములు రాక్షసులను సంహరించెను. ఇదియు లోక రక్షణార్థమే. ఇన్ని చేయుచు ఆయన ఉదాసీనుడుగా కూడ ఉండును. భోగించుట, తపస్సుచేయుట, పాలించుట, ఉదాసీనముగా నుండుట యను విరుద్ధాంశములను నిర్వహించుటకు విష్ణువే సమర్థుడు.

శ్లో॥ బహుధా ప్యాగమై ర్భిన్నాః
పంథానః సిద్ధిహేతవః
త్వయ్యేవ నిపతం త్యోఘా
జాహ్నవీయా ఇవార్ణవే. 27

పద విభాగము : బహుధా, అపి, ఆగమైః, భిన్నాః, పంథానః, సిద్ధిహేతవః, త్వయి, ఏవ, నిపతంతి, ఓఘాః, జాహ్నవీయాః, ఇవ, అర్ణవే,

అన్వయము : ఆగమైః బహుధా భిన్నాః అపి సిద్ధిహేతవః పంథానః జాహ్నవీయాః ఓఘా అర్ణవే ఇవ త్వయ్యేవ నిపతంతి.

అర్థము : ఆగమైః = శాస్త్రములచేత; బహుధా = పెక్కు విధములు; భిన్నాః-అపి = వేఱయినను; సిద్ధిహేతవః = పురుషార్థ సాధకము లైన; పంథానః = మార్గములు; ఆగమైః = గతులచేత; బహుధా = పెక్కు తీరుల; భిన్నాః +

అపి = వేర్వేరయినను; సిద్ధిహేతవః = పుణ్యకారణములయిన; జాహ్నవీయాః = గంగా సంబంధములయిన; ఓఘాః = ప్రవాహములు; అర్ణవే-ఇవ = సముద్రమునందుపలె; త్వయి + ఏవ = నీయందే; నిపతంతి = పడుచున్నవి.

తాత్పర్యము : గతులచేత పెక్కు తీరుల భిన్నములయ్యు పుణ్యహేతువు లయిన గంగా నదీ ప్రవాహములు సముద్రునియందే పడుచున్నట్లుగా శాస్త్రములచేత బహుథా భిన్నములయ్యు పురుషార్థ సిద్ధికి సాధనములయిన మార్గములన్నియు నీయందే ప్రవేశించుచున్నవి.

అలంకారము : శ్లేష, ఉపమ.

వ్యాఖ్యానము : ఋగ్యజుస్సామములను మూడు వేదములు, సాంఖ్య యోగ న్యాయ వైశేషిక మీమాంసా వేదాంతములనెడు ఆరు దర్శనములు - ఇవన్నియు తత్వ బోధకములగు ఆగమములు - శాస్త్రములు. వీని మార్గములు భిన్నములైనట్లు కనబడును.

ఇవి యన్నియు తత్వ ప్రతిపాదకములే యగుటచే వీని మార్గములు భిన్నములయ్యు గమ్యము ఒక్కటే. ఇవి యన్నియు మోక్షప్రాప్తికి హేతువులు. కనుక అన్నియు మోక్షస్థానమైన విష్ణువునందే కలియుచున్నవి. జ్ఞానమే మోక్షము జ్ఞానసాధనములన్నియు మోక్షసాధనములే. దర్శనములు పెక్కు కలవు. వానిలో వైదికములైన దర్శనములే మోక్ష ప్రదములు. అవైదికములైన చార్వాక బౌద్ధాది దర్శనములు మోక్షప్రదములు కావు. వైదిక దర్శనములు గంగా ప్రవాహముల వంటివి. అన్య దర్శనములు అన్య నదీ ప్రవాహముల వంటివి. కనుక ఇచ్చట జాహ్నవీయములైన ప్రవాహములే సిద్ధిహేతువులైన ఆగమములకు ఉపమానముగా గ్రహింప బడినవి.

" ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి "

అను శ్లోకము నిట స్మరింపవలెను. తత్వదర్శకులైన మహర్షులచే ప్రతిపాదింపబడిన సర్వదర్శనములు సిద్ధిహేతువులే కనుక అవి నిన్నే చేరును అని భావము. ఆగమ శబ్దము శాస్త్రము, గమనము అను నర్థములందును, సిద్ధియను

శ్లో॥ ఉదధే రివ రత్నాని
తేజాంసీవ వివస్వతః
స్తుతిభ్యోఽప్యతిరిచ్యంతే
దూరాణి చరితాని తే. 31

పద విభాగము : ఉదధేః, ఇవ, రత్నాని, తేజాంసి, ఇవ, వివస్వతః, స్తుతిభ్యః, అపి, అతిరిచ్యంతే, దూరాణి, చరితాని, తే.

అన్వయము : ఉదధేః రత్నాని ఇవ వివస్వతః తేజాంసి ఇవ దూరాణి తే చరితాని స్తుతిభ్యః అపి అతిరిచ్యంతే.

అర్థము : ఉదధేః = సముద్రముయొక్క; రత్నాని-ఇవ = రత్నములు వలె; వివస్వతః = సూర్యునియొక్క; తేజాంసి-ఇవ = కిరణములువలె; దూరాణి = గోచరములు కాని; తే = నీయొక్క; చరితాని = వర్తనములు; స్తుతిభ్యః-అపి = స్తుతులకంటెను; అతిరిచ్యంతే = మీరిపోవుచున్నవి.

తాత్పర్యము : సముద్రముయొక్క రత్నములవలె, సూర్యునియొక్క కిరణములవలె అగమ్యములయిన నీ వర్తనములు స్తుతులకంటెను మించిపోవుచున్నవి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : సముద్రము నందలి రత్నములు అగమ్యములు. సూర్యుని యొక్క తేజస్సులును అగమ్యములే. వీనివలె పరమేశ్వరుని ప్రవర్తనలును అగమ్యములే. అగమ్యములు అనగా చేరరానివనియు, తెలిసికొనరానివనియు అర్థము. సముద్రమున రత్నములు పెక్కు కలవని తెలియును, ఎన్నియో తెలియదు. కనుక ఆ రత్నములను స్తుతింప శక్యము కాదు. సూర్యకిరణముల విషయము నిట్లే. ఆదిపురుషుని చరితములు నిట్టివే. ఇన్ని యని యెఱుగరానందువల్ల ఈశ్వరుని దివ్యచరితములు వర్ణనాతీతములు.

అవాఙ్మానసగోచరుడగు భగవంతుని గుణములలో శబ్దానుమానప్రమాణములకు గమ్యములయిన కొన్నింటిని వర్ణించి, తక్కినవి మనస్సుచే ఊహించుటకు

గాని, వాక్కుచే వర్ణించుటకుగాని అసాధ్యములైనవని దేవతలు విష్ణుదేవుని గుణసాకల్య వర్ణనమున తమ యసమర్థతను నివేదించుచున్నారు. దేవతలచే నిట్లనిపించుట కాళిదాసు గడుసుదనము. ఇట్లనిపించనిచో ఈ స్తుతికి ముగింపు సంభవముకాదు తరువాతి కథ నడువదు. 'స్తుతిభ్యోఽపి' అనుటచేత ఇచ్చట స్తుతి యనగా అతిశయోక్తి యని గ్రహింపవలెను. అనంత గుణసంపన్నుడైన భగవంతునిపట్ల అతిశయోక్తియు అక్కరకురాదు.

శ్లో॥ అనవాప్త మవాప్తవ్యం
న తే కించన విద్యతే
లోకానుగ్రహ ఏవైకో
హేతుస్తే జన్మకర్మణోః. 32

పద విభాగము : అనవాప్తం, అవాప్తవ్యం, న, తే, కించన, విద్యతే, లోకానుగ్రహః, ఏవ, ఏకః, హేతుః, తే, జన్మకర్మణోః.

అన్వయము : అనవాప్తం అవాప్తవ్యం తే కించన న విద్యతే; లోకానుగ్రహః ఏకః ఏవ తే జన్మకర్మణోః హేతుః.

అర్థము : అనవాప్తం = పొందబడనిది; అవాప్తవ్యం = పొందదగినది; తే = నీకు; కించన = ఏదియు; న-విద్యతే = లేదు; లోక = లోకమునందలి, అనుగ్రహః = దయ; ఏకః-ఏవ = ఒక్కటియే; తే = నీయొక్క; జన్మ-కర్మణోః = జన్మకు కర్మకు; హేతుః = కారణము.

తాత్పర్యము : పొందబడనిది, పొందదగినది నీకు ఏదియు లేదు. లోకమునందలి దయ యొక్కటియే నీయొక్క జన్మకు కర్మకు హేతువు.

వ్యాఖ్యానము : ఇంతవరకు భగవంతుని గుణగణములను యథాశక్తి వర్ణించి దేవతలు ఇప్పుడు ప్రకృత విషయమును అవలంబింపబోవుచున్నారు. ఆయన భూలోకమున నవతరించి, వర్తించి, రాక్షస సంహారము కావింపవలసి యున్నది గనుక జన్మ కర్మల ప్రసంగము చేయుచున్నారు. పురాకృత కర్మఫలముగా మానవులు జన్మల నంది కర్మ లాచరింతురు. ఈశ్వరునకు కర్మలు, వాని

ఫలములు అంటవు. ఐనను ఆయన జన్మలెత్తి కర్మ లాచరించును. దానికి గారణము లోకానుగ్రహబుద్ధియే. ఆయనకు పొందబడనిది, పొందదగినది ఏదియు లేదు. ఆయన పూర్ణకాముడు. పూర్ణకామునకు జన్మ లేదు, కర్మ లేదు.

"విదితంవో యథా స్వార్థా న మే కాశ్చిత్ ప్రవృత్తయః" అను కుమార సంభవమునందలి పరమేశ్వర వాక్యము నిట స్మరింపదగును.

స్వార్థములైన జన్మ కర్మలు లేని నీవు లోకకల్యాణార్థము జన్మ కర్మలందు ప్రవృత్తుడవు కావలసి యున్నది అని దేవతల సూచన.

శ్లో॥ మహిమానం యదుత్కీర్త్య
తవ సంహ్రియతే వచః
శ్రమేణ తదశక్త్యా వా
న గుణానా మియత్తయా. 33

పదవిభాగము : మహిమానం, యత్, ఉత్కీర్త్య, తవ, సంహ్రియతే, వచః, శ్రమేణ, తత్, అశక్త్యా, వా, న, గుణానాం, ఇయత్తయా.

అన్వయము : తవ మహిమానం ఉత్కీర్త్య వచః సంహ్రియతే (ఇతి) యత్ తత్ శ్రమేణ అశక్త్యా వా; గుణానాం ఇయత్తయా న.

అర్థము : తవ = నీయొక్క; మహిమానం = మహిమను; ఉత్కీర్త్య = కీర్తించి; వచః = వాక్కు; సంహ్రియతే = విరమింపబడుచున్నది; ఇతి-యత్ = అనునది ఏదికలదో; తత్ = అది; శ్రమేణ = అలసట చేతగాని; అశక్త్యా-వా = అసమర్థతచేతగాని (అగుచున్నది); గుణానాం = నీ గుణములయొక్క; ఇయత్తయా = ఇన్నియను పరిమితిచేత; న = కాదు.

తాత్పర్యము : నీ మహిమను విశేషముగా కీర్తించి వాక్కు విరమింపబడుచున్నదనునది ఏదికలదో అది శ్రమచేతగాని, అసమర్థతచేతగాని అగుచున్నది. అంతేకాని నీ గుణముల పరిమితిచేత మాత్రముకాదు.

వ్యాఖ్యానము : అనంతమైన విష్ణుదేవుని మహిమను సాంతముగా వర్ణించుట దేవతలకును శక్యముకాదు. వర్ణనము ఎక్కడనో ఆగక తప్పదు. ఆగుటకు

కారణములు రెండు—మనస్సు, వాక్కు పరిమితశక్తులు గనుక భగవంతుని గుణముల పారమును చేరజాలక మనస్సు అలసిపోవచ్చును. లేదా మనస్సునకు గోచరములైన గుణములనుగూడ చక్కగా ప్రతిపాదించుటకు వాక్కు అశక్తము కావచ్చును.

“యతో వాచో నివర్త్యంతే అప్రాప్య మనసా సహ” అని శ్రుతి చెప్పుచున్నది. విష్ణుదేవుని మహిమ సాకల్యముగ తెలిసికొనవలెనని మనస్సు, వాక్కు బయలుదేరినవి. మనస్సు కొంతవఱకుపోయి అలసిపోయినది. వాక్కు మనస్సు పోయినంతవఱకును పోజాలక ఆగిపోయినది. తుదకు మనస్సు, మాట కలసి మరలివచ్చినవి. కనుక ఆదిపురుషుడు వాక్కునకు, మనస్సునకు గోచరుడు కాడు-అవాఙ్మానసగోచరుడు అని చెప్పబడినది. దేవతలు గూడ తమ మనస్సునకు గమ్యమైనంతవరకు, వాక్కునకు శక్యమైనంతవరకు భగవంతుని మహిమను స్తుతించి తప్పనిసరియై విరమించిరి. అట్లు విరమించుటకు గారణము తమ అసమర్థతయే కాని ఆ దేవుని మహిమయొక్క పరిమితత్వముకాదని విన్నవించిరి. పరమేశ్వరుని గుణములు అనంతములు గనుక అంతములేనివానిని సాంతముగ వర్ణించుట అసంభవము అని భావము.

ఇచ్చట గుణసంకీర్తనోపసంహరణము ప్రకృత కార్యనివేదనమునకు అవకాశము కల్పించుకొనుటకు.

శ్లో॥ ఇతి ప్రసాదయామాసు
స్తే సురా స్తమధోక్షజమ్
భూతార్థ వ్యాహృతి స్సా హి
న స్తుతిః పరమేష్ఠినః. 34

పదవిభాగము: ఇతి, ప్రసాదయామాసుః, తే, సురాః, తం, అధోక్షజం, భూతార్థవ్యాహృతిః, సా, హి, న, స్తుతిః, పరమేష్ఠినః.

అన్వయము: ఇతి తే సురాః తం అధోక్షజం ప్రసాదయామాసుః; హి పరమేష్ఠినః సా భూతార్థవ్యాహృతిః న స్తుతిః.

శబ్దము మోక్షము, పుణ్యము నను నర్థము లందును ప్రయుక్తములగుటచేత శ్లేష. ఇది ఉపమాలంకారమునకు బలము చేకూర్చుచున్నది.

శ్లో॥ త్వయ్యావేశిత చిత్తానాం
త్వత్సమర్పిత కర్మణాం
గతి స్త్వం వీతరాగాణా
మభూయ స్సన్నివృత్తయే. 28

పద విభాగము : త్వయి, ఆవేశితచిత్తానాం, త్వత్సమర్పిత కర్మణాం, గతిః, త్వం, వీతరాగాణాం, అభూయస్సన్నివృత్తయే.

అన్వయము : త్వయి ఆవేశిత చిత్తానాం త్వత్సమర్పితకర్మణాం వీత రాగాణాం అభూయస్సన్నివృత్తయే త్వం గతిః.

అర్థము : త్వయి = నీయందు; ఆవేశిత = నిలుపబడిన; చిత్తానాం = చిత్తము గలవారు; త్వత్ = నీయందు; సమర్పిత = అర్పింపబడిన; కర్మణాం = కర్మ గలవారు; అయిన; వీత-రాగాణాం = విరక్తులకు; అభూయస్సన్ని వృత్తయే = మరల జన్మము లేకుండుటకై; త్వం = నీవే; గతిః = సాధనము.

తాత్పర్యము : నీయందు సమర్పింపబడిన చిత్తములు గలవారు, నీయందు సన్న్యసింపబడిన కర్మలు గలవారు నయిన విరక్తులకు పునరావృత్తి రాహిత్యము కొఱకు నీవే దిక్కు.

వ్యాఖ్యానము : కర్మ సన్న్యాస యోగము మోక్షహేతువని భగవద్గీత యందు చెప్పబడినదాని సారము ఈ శ్లోకము. అభూయస్సన్నివృత్తి యనగా మోక్షము. అది లభించుటకు నారాయణుడే కారణము. మనస్సును విషయముల నుండి మరల్చి నారాయణునియందే నిలుపవలెను. అనాసక్తితో చేయబడిన కర్మల ఫలమును నారాయణునియందే అర్పించవలెను. అట్టివారికి ముక్తి లభించును.

గీత యందలి భగవద్వాక్యము ఇట స్మరింపదగును -

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే."

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

శ్రుతియు నిట్లే చెప్పుచున్నది –

"తమేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథాః అయనాయ విద్యతే."

శ్లో॥ ప్రత్యక్షోఽప్య పరిచ్ఛేద్యో
మహ్యాది ర్మహిమా తవ
ఆప్తవాగనుమానాభ్యాం
సాధ్యం త్వాం ప్రతి కా కథా ? 29

పద విభాగము : ప్రత్యక్షః అపి, అపరిచ్ఛేద్యః, మహ్యాదిః, మహిమా, తవ, ఆప్తవాగనుమానాభ్యాం, సాధ్యం, త్వాం, ప్రతి, కా, కథా.

అన్వయము : ప్రత్యక్షః అపి మహ్యాదిః తవ మహిమా అపరిచ్ఛేద్యః; ఆప్తవాగనుమానాభ్యాం సాధ్యం త్వాం ప్రతి కా కథా ?

అర్థము : ప్రత్యక్షః–అపి = ప్రత్యక్ష ప్రమాణగమ్య మయ్యు; మహీ + ఆదిః = భూమి మొదలుగా గల; తవ = నీయొక్క; మహిమా = గొప్పదనము; అపరిచ్ఛేద్యః = ఇంతని యెఱుగరానిది; ఆప్త వాక్ + అనుమానాభ్యాం = శబ్దము, అనుమానము అను రెండు ప్రమాణములచేత; సాధ్యం = తెలిసికోదగిన; త్వాం–ప్రతి = నిన్ను గూర్చి; కా–కథా = చెప్పెడిదేమి ?

తాత్పర్యము : ప్రత్యక్ష ప్రమాణముచే నెఱుగదగిన పృథివి మున్నగు నీ మహత్తు ఇంతటిదని చెప్ప శక్యము గానిదన్నప్పుడు శబ్దానుమాన ప్రమాణములచే మాత్రమే గమ్యుడవైన నిన్నుగూర్చి యింకేమి చెప్పవలెను ?

అలంకారము : అర్థాపత్తి.

వ్యాఖ్యానము : పరమాత్మ ప్రత్యక్ష ప్రమాణ గమ్యము కాదు. ఆయన మహిమను వ్యంజించు పృథివ్యాదులు ప్రత్యక్షములు. ప్రత్యక్షమైన మహ్యాది రూప

మగు ఆయన మహిమయే ఇంతటిదని తెలియ శక్యము గానిది. అప్రత్యక్షమై ఆగమ, అనుమాన ప్రమాణములచేత మాత్రమే గమ్యమైన ఆయన తత్వము ఇంతటిదని తెలియ శక్యముగాదని చెప్పనక్కఱలేదు.

ఆప్తవాక్యమనగా వేదము. పరమేశ్వరుడు వేద వాగ్రూపమైన శబ్ద ప్రమాణముచేత గమ్యుడు. భూమ్యాదులే ఇంతవై యుండగా వానిని సృష్టించిన పరమేశ్వరు డంతకంటె గొప్పవాడై యుండవలయును అను అనుమాన ప్రమాణము చేతకూడ ఈశ్వర మహిమ గమ్యమగును ప్రత్యక్షప్రమాణ గమ్యమైనదే అపరిమేయమైనప్పుడు శబ్దానుమాన ప్రమాణగమ్యమైనది అపరిమేయమని చెప్పనక్కఱలేదు. ఒక విషయము చెప్పినచో ఇంకొక విషయము చెప్పనక్కఱలేనప్పుడు మొదటి యర్థముచేతనే రెండవ యర్థము ఆపతిత మగుచున్నదన్నమాట. ఇట్టి దానిని అర్థాపత్తి యందురు. ప్రత్యక్షము, శబ్దము, ఉపమానము, అనుమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి యని జ్ఞానసాధనములైన ప్రమాణములు ఆఱు. ఒక విషయము చెప్పగా రెండవ విషయము దానియంతట అదే తెలియబడుట అర్థాపత్తి. గారెలు గ్రుచ్చిన కఱ్ఱను ఎలుకలు ఎత్తుకొనిపోయినవి అన్నప్పుడు గారెలను ఎత్తుకొనిపోయినవనికూడ తెలియుచున్నది గదా. కనుక అర్థాపత్తిని దండాపూప న్యాయమందురు. "కా కథా" యనుటకు బదులు 'కిముత' అనియు నందురు. అందువల్ల అర్థాపత్తికి కైముత్య న్యాయమనియు పేరు.

ప్రత్యక్షమైన ఈశ్వర మహిమయే అపరిచ్ఛేద్య మన్నప్పుడు శబ్దానుమాన లభ్యమైన ఈశ్వర తత్త్వము అపరిచ్ఛేద్యమని చెప్పినట్లే అయినది గనుక ఇది అర్థాపత్తి యను నలంకారము

శ్లో॥ కేవలం స్మరణే నైవ
పునాసి పురుషం యతః
అనేన వృత్తయ శ్శేషా
నివేదిత ఫలా స్త్వయి. 30

పద విభాగము : కేవలం, స్మరణేన, ఏవ, పునాసి, పురుషం, యతః, అనేన, వృత్తయః, శేషాః, నివేదితఫలాః, త్వయి.

అన్వయము : కేవలం స్మరణేన ఏవ పురుషం యతః పునాసి అనేన త్వయి శేషాః వృత్తయః నివేదితఫలాః.

అర్థము : కేవలం = సంపూర్ణముగా; స్మరణేన-ఏవ = స్మరణముచేతనే; పురుషం = పురుషుని; యతః = ఏ కారణమువల్ల; పునాసి = పవిత్రుని చేయుదువో; అనేన = ఈ స్మరణముచేతనే; త్వయి = నీయందు; శేషాః = మిగిలిన; వృత్తయః = దర్శనాదులైన వ్యాపారములు; నివేదిత-ఫలాః = తెలియజేయబడిన ప్రయోజనములు గలవి.

తాత్పర్యము : కేవలము స్మరణముచేతనే పురుషుని పవిత్రుని గావింతువు గావున ఈ స్మరణము చేతనే నీయందు ఇతరములయిన దర్శన స్పర్శనాదులయిన వ్యాపారములు తెలియజేయ బడిన ప్రయోజనములు గలవి యగుచున్నవి.

వ్యాఖ్యానము : ఈశ్వరుని స్మరించుట కంటె, దర్శించుట, స్పృశించుట, భాషించుట మున్నగునవి పవిత్రతరములు. తన్ను స్మరించిన వానిని పరమేశ్వరుడు పవిత్రుని గావించును అనుట వల్లనే ఆయనను దర్శించిన వానిని, స్పృశించిన వానిని మరింత పవిత్రుని గావించును అని చెప్పినట్లయినది. స్మరణమే పావనము అనుటవల్ల దర్శనాదికముల ఫలము చెప్పకయే చెప్పినట్లయినది. స్మరణము ఎల్లరును చేయవచ్చును. దర్శన స్పర్శనాదులు ఎంతో తపస్సు చేసిన వారికి గాని సాధ్యముకావు. కనుక అవి మరింత పవిత్రము చేయగలవి అని భావము. కుమార సంభవమున సప్తర్షులు పరమేశ్వరునిచే స్మరింపబడి సన్నిహితులై పలికిన మాట—

" యస్య చేతసి వర్తేథాః స తావ త్కృతినాం పరః
కిం పునర్బ్రహ్మ యోనే ర్య స్తవ చేతసి వర్తతే "

ఎవ్వని చిత్తమున నీవుందువో వాడు సుకృతి శ్రేష్ఠుడు. వేద జనకుడవైన నీ చిత్తమున ఎవడు వర్తించునో వాని సంగతి ఏమి చెప్పవలెను? అట్టివాడు సుకృతి శ్రేష్ఠులలో శ్రేష్ఠుడని భావము.

అర్థము : ఇతి = ఈ విధముగా, ఇట్లని; తే-సురాః = ఆ దేవతలు; తం-అధోక్షజం = ఆ విష్ణుదేవుని; ప్రసాదయామాసుః = ప్రసన్నుని గావించిరి; హి = ఏలయనగా; పరమేష్ఠినః = సర్వోత్కృష్టుడైన భగవంతునకు; సా = అది; భూత-అర్థ-వ్యాహృతిః = సత్యమైన విషయముయొక్క ఉక్తియే కాని; స్తుతిః-న = పొగడ్త కాదు.

తాత్పర్యము : ఇట్లని పలికి దేవతలు ఆ విష్ణుదేవుని ప్రసన్నుని గావించిరి. ఏలయన సర్వోత్కృష్టుడైన భగవంతునకు అదియంతయు సత్యమైన విషయముయొక్క ఉక్తియే కాని ప్రశంసామాత్రముకాదు.

వ్యాఖ్యానము : అధోక్షజుడనగా ఇంద్రియజన్యమైన జ్ఞానము తనక్రింద గలవాడు. అనగా ఇంద్రియ జన్య (ప్రత్యక్ష) జ్ఞానమునకు అతీతుడైనవాడు-శబ్దానుమానప్రమాణగమ్యుడైనవాడు. దేవతలు పలికిన వాక్యములు విని ఆయన ప్రసన్నుడయ్యెను. అనగా తేటయైన చిత్తముగలవాడయ్యెను. భగవంతుడు స్తోత్రప్రియుడందురు. కాని, కాళిదాసుని యభిప్రాయమున భగవంతుడు కేవలము యథార్థోక్తి ప్రియుడేకాని స్తుతిప్రియుడు కాడు. దేవతలు పలికిన వాక్యములు భూతార్థకథనములేకాని అభూతకల్పనలుకావు. కనుకనే సత్యవచనులైన దేవతలపట్ల ఆ దేవుడు ప్రసన్న చిత్తుడయ్యెను. ఆయన పరమేష్ఠి-అనగా సర్వోన్నత స్థానమునందున్నవాడు. ఆయననుగూర్చి యెంత చెప్పినను అది భూతార్థవ్యాహృతియే యగును గాని స్తుతి కాజాలదు.

శ్లో॥ తస్మై కుశల సంప్రశ్న
వ్యంజిత ప్రీతయే సురాః
భయ మప్రళయోద్వేలా
దాచఖ్యు ర్నైరృతోదధేః.

పద విభాగము : తస్మై, కుశల సంప్రశ్నవ్యంజిత ప్రీతయే, సురాః, భయం, అప్రళయోద్వేలాత్, ఆచఖ్యుః, నైరృతోదధేః.

అన్వయము : సురాః కుశల సంప్రశ్నవ్యంజిత ప్రీతయే తస్మై అప్రళయోద్వేలాత్ నైరృతోదధేః భయం ఆచఖ్యుః.

అర్థము : సురాః = దేవతలు; కుశల-సంప్రశ్న = క్షేమమును గూర్చిన ప్రశ్నచేత; వ్యంజిత-ప్రీతయే = వ్యక్తము చేయబడిన ప్రీతిగల; తస్మై = విష్ణుదేవునకు; అప్రళయ + ఉద్వేలాత్ = ప్రళయము లేకయే పొంగుచున్న; నైరృత + ఉదధేః = రాక్షసు డనెడి సముద్రమువలన గలిగిన; భయం = భయమునుగూర్చి; ఆచఖ్యుః = చెప్పిరి.

తాత్పర్యము : దేవతలు కుశలప్రశ్నముచేత వ్యక్తము చేయబడిన ప్రీతిగల ఆ విష్ణుదేవునకు ప్రళయము లేకయే పొంగుచున్న రావణాసురు డనెడి సముద్రమువలన గలిగిన భయమును విన్నవించిరి.

అలంకారము : రూపకము.

వ్యాఖ్యానము : దేవతలు పలికిన దంతయు విని విష్ణుదేవుడు 'మీకు కుశలమా ?' అని మాత్రము ప్రశ్నించెను. ఆ ప్రశ్నవల్లనే ఆయనకు వారిపట్ల గల ప్రీతి వ్యక్తమగుచున్నది. ఏల వచ్చితిరి ? అని ఆయన యడుగలేదు. కుశలమా యన్న ప్రశ్నయే వారు వచ్చిన పనిని నివేదించుటకు దగిన యవకాశ మిచ్చుచున్నది. సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు నైన భగవంతునకు దేవతల కుశలము తెలియదా ?

తెలియును. ఐనను కుశలమా యని ప్రశ్నించుట సముదాచారము. అదియే దేవతలకు తమ కష్టములు చెప్పికొనుటకు అవకాశము కలిగించినది. వారు చెప్పిరి - ఒక్క ముక్కలో చెప్పిరి. అది చెప్పుటకాదు, గుర్తుచేయుట. అదియు రూపకముతో అతి చమత్కారముగా.

విష్ణుదేవుడు శయనించియున్న యుదధియందు ఎట్టి కల్లోలము లేదు. ప్రశాంతముగా నున్నది. ప్రళయకాలమున గాని అది ఉద్వేలము కాదు. రావణుడను సముద్రమున్నది. అది ప్రళయకాలము కాకనే ఉద్వేలమగుచున్నది. దానివల్ల దేవతలు భయపడుచుండిరి. ఆ భయమునుగూర్చి భగవంతునకు విన్నవించిరి. సాగరశయనుడై యున్న భగవంతునకు తమ భయకారణమును ఉద్వేల సాగరారోపణముచేసి చెప్పుట దేవతల చతురత - అనగా కాళిదాసు చతురత. ఈ యారోపణమువల్ల దేవతల భయకారణము రూపవంతమై కన్నులకు గట్టినట్లుండును.

శ్లో॥ అథ వేలాసమాసన్న
శైల రంధ్రానునాదినా
స్వరేణో వాచ భగవాన్
పరిభూతార్ణవ ధ్వనిః. 36

పద విభాగము : అథ, వేలాసమాసన్న శైలరంధ్రానునాదినా, స్వరేణ, ఉవాచ, భగవాన్, పరిభూతార్ణవ ధ్వనిః.

అన్వయము : అథ వేలాసమాసన్న శైలరంధ్రానునాదినా స్వరేణ పరిభూతార్ణవధ్వనిః భగవాన్ ఉవాచ.

అర్థము : అథ = అనంతరము; వేలా = చెలియలికట్టకు; సమాసన్న = చేరువనున్న; శైలరంధ్ర = పర్వత గుహలందు; అనునాదినా = ప్రతిధ్వనించునట్టి; స్వరేణ = కంఠస్వరముతో; పరిభూత = తిరస్కరింపబడిన; అర్ణవ-ధ్వనిః = సముద్రఘోష గలిగిన; భగవాన్ = విష్ణుదేవుడు; ఉవాచ = పలికెను.

తాత్పర్యము : అనంతరము చెలియలికట్ట సమీపమందున్న పర్వత గుహల యందు ప్రతిధ్వనించు కంఠస్వరముతో తిరస్కరింపబడిన సాగరఘోష గలవాడై భగవంతు డిట్లనెను.

వ్యాఖ్యానము : ప్రతిధ్వని వర్ణనము కాళిదాసునకు ప్రియము. రాక్షసోపద్రవము వినినంతనే భగవంతుడు పలుకనారంభించెను. ఆయన కంఠస్వరము సాగర తీరమందలి శైల రంధ్రములలో ప్రతిధ్వనించి దాని గాంభీర్యము ద్విగుణీకృతమయ్యెను. అట్టి ధ్వని ఆయన శయనించియున్న సాగర ధ్వనిని పరాభవించుచుండెను. ఆయన శయనించియున్న సాగరము యొక్క ధ్వనిని ఆయన కంఠస్వరము పరాభవించుచున్నదని వాచ్యార్థము. దేవతలు రావణునియందు ఉద్వేల సాగరము నారోపించి చెప్పుటవల్ల విష్ణుదేవుని కంఠస్వరము ఉద్వేల రావణ సాగర హుంకార ధ్వనిని పరాభవించుచున్నది అని వ్యంగ్యార్థము ఏర్పడుచున్నది. విష్ణుదేవుని కంఠస్వరమే రావణ గర్వాపహరణ సంకల్పమును వ్యంజించుచున్నదని భావము.

శ్లో॥ పురాణస్య కవే _స్తస్య
వర్ణస్థాన సమీరితా
బభూవ కృతసంస్కారా
చరితార్థైవ భారతీ. 37

పద విభాగము : పురాణస్య, కవేః, తస్య, వర్ణ స్థాన సమీరితా, బభూవ, కృత సంస్కారా, చరితార్థా, ఏవ, భారతీ.

అన్వయము : పురాణస్య కవేః తస్య వర్ణస్థాన సమీరితా కృతసంస్కారా భారతీ చరితార్థా ఏవ.

అర్థము : పురాణస్య = పురాతనుడును; కవేః = సర్వజ్ఞుడును నైన; తస్య = ఆ భగవంతునియొక్క; వర్ణ-స్థాన = వర్ణోత్పత్తి స్థానములందు; సమీరితా = చక్కగా నుచ్చరింపబడినదై; కృత-సంస్కారా = సంపాదింపబడిన సాధుత్వము గల; భారతీ = వాగ్దేవి; చరితార్థా + ఏవ = కృతార్థురాలు అయ్యెను.

తాత్పర్యము : పురాతనుడు, సర్వజ్ఞుడు నైన ఆ విష్ణుదేవునియొక్క కంఠ తాల్వాది వర్ణోద్భవ స్థానములందు చక్కగా నుచ్చరింపబడినదై సాధుత్వము పొందిన వాగ్దేవి నిశ్చయముగా కృతార్థురాలయ్యెను.

వ్యాఖ్యానము : విష్ణుదేవుని కంఠస్వరము ధీరము, గంభీరము నై యున్నది. ఆ స్వరము వర్ణోద్భవ స్థానములందు చరించి సుపరిష్కృతమైన వాక్కుగా రూపొందినది. విష్ణుదేవుడు పురాణ కవి - అనగా సనాతనుడైన సర్వజ్ఞుడు. ఆయన యుచ్చరించినందువల్ల ప్రాకృతమైన భారతి సంస్కృత యైనది, ధన్య యైనది. లోకకల్యాణకారి యైన యర్థమును ప్రతిపాదించుటకు ఉపయోగపడినది గనుక ధన్య యైనదని గ్రహింపవలెను. పరిపక్వమైన కంఠ స్వరము, స్పష్టమైన యుచ్చారణము, కల్యాణకరమైన యర్థము లభ్యమైనచో సరస్వతీ సంస్కృతయు, చరితార్థయు నగును. ధ్వని, వర్ణ, పద, వాక్య రూపమున భారతియొక్క క్రమావిర్భావము సూచింపబడినది.

శ్లో॥ బభౌ సదశన జ్యోత్స్నా
సా విభో ర్వదనోద్గతా
నిర్యాతశేషా చరణా
ద్గంగే వోర్ధ్వ ప్రవర్తినీ. 38

పదవిభాగము : బభౌ, సదశనజ్యోత్స్నా, సా, విభోః, వదనోద్గతా, నిర్యాతశేషా, చరణాత్, గంగా, ఇవ, ఊర్ధ్వప్రవర్తినీ.

అన్వయము : విభోః వదనాత్ ఉద్గతా సదశనజ్యోత్స్నా సా (భారతీ) చరణాత్ నిర్యాతశేషా ఊర్ధ్వప్రవర్తినీ గంగా ఇవ బభౌ.

అర్థము : విభోః = విష్ణుదేవుని యొక్క; వదనాత్ = ముఖమునుండి; ఉద్గతా = బయటికి వచ్చిన; సదశనజ్యోత్స్నా = దంతకాంతులతో గూడిన; సా (భారతీ) = ఆ వాగ్దేవి; చరణాత్ = పాదమునుండి; నిర్యాత-శేషా = బయటికి ప్రసరించి మిగిలియున్న; ఊర్ధ్వ ప్రవర్తినీ = పై దిక్కుగా ప్రసరించుచున్న; గంగా-ఇవ = గంగవలె; బభౌ = ప్రకాశించెను.

తాత్పర్యము : ఆ విష్ణుదేవుని వదనమునుండి బయటికి ప్రసరించి దంతకాంతులతో గూడియున్న యా భారతీదేవి ఆయన పాదమునుండి వెలువడగా మిగిలి పైదిక్కునకు ప్రసరించుచున్న గంగయా యన్నట్లు ప్రకాశించెను.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : విష్ణుదేవుడు పలుకదొడగినంతనే ఆయన పెదవులు విప్పారి దంతకాంతులు వెన్నెలలవలె విరిసెను. ఆ వెన్నెలలతో గూడినదై వాక్కు వెలువడెను. సరస్వతి "కుందేందు తుషారహార ధవళ". దంతకాంతుల వెన్నెలలలో ఆమె మరింత ధవళగా భాసించెను. శేషాసనాసీనుడై విష్ణువు మాట్లాడుచుండెను. దేవతలు ఆయనకు దిగువభాగమున నిల్చియుండిరి. దంతకాంతులతో గూడి ఆ దేవుని వదనమునుండి వెలువడుచున్న శుభ్రవర్ణయైన భారతి ఆయన పాదముల దిగువనున్న దేవతలకు ఆయన పాదములనుండి యూర్ధ్వముఖముగా ప్రసరించుచున్న గంగయా యన్నట్లు తోచెను. శుద్ధ గంగ శ్వేతవర్ణ. గంభీరధ్వనితో ఆ దేవుని నోటినుండి క్రిందికి ప్రసరించుచున్న స్ఫటిక వర్ణయైన

సరస్వతి గంభీరధ్వనితో ఆయన పాదములనుండి యూర్ధ్వ ముఖముగా ప్రసరించు చున్న గంగవలె దేవతలకు భాసించినది. ఉపమేయమైన భారతి ఉపమానమైన గంగగా ఊహింపబడినది గనుక ఉత్ప్రేక్ష.

శ్లో॥ జానే వో రక్షసా క్రాంతా
వనుభావ పరాక్రమౌ
అంగినాం తమసేవోభౌ
గుణౌ ప్రథమ మధ్యమౌ. 39

పదవిభాగము : జానే, వః, రక్షసా, ఆక్రాంతౌ, అనుభావ పరాక్రమౌ, అంగినాం, తమసా, ఇవ, ఉభౌ, గుణౌ, ప్రథమ మధ్యమౌ.

అన్వయము : వః అనుభావ పరాక్రమౌ రక్షసా అంగినాం ప్రథమ మధ్యమౌ గుణౌ తమసా ఇవ ఆక్రాంతౌ జానే.

అర్థము : వః = మీయొక్క; అనుభావ-పరాక్రమౌ = మహిమయు, పురుషకారమును; రక్షసా = రావణాసురునిచేత; అంగినాం = ప్రాణులయొక్క; ప్రథమ-మధ్యమౌ = మొదటిదియు నడిమిదియునైన; గుణౌ = సత్త్వము, రజస్సు అను రెండు గుణములు; తమసా + ఇవ = తమోగుణముచేతవలె; ఆక్రాంతౌ = ఆక్రమింపబడిన వానినిగా; జానే = ఎఱుగుదును.

తాత్పర్యము : ఓ దేవతలారా ! మీయొక్క మహిమయు, పురుషకారమును ఆ రావణాసురునిచేత, మానవుల సత్త్వరజోగుణములు తమోగుణముచేత వలె, ఆక్రమింపబడినవానినిగా నెఱుగుదును.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : 'జానే' ఎఱుగుదును అని విష్ణువు వాక్యారంభము చేయుట యుచితముగా నున్నది. 'రక్షసా' అను ఏకవచనమువల్ల ఒక్క రావణునిచే దిక్పాలకులందఱి మహిమలు, పరాక్రమములు ఆక్రమింపబడినవని వ్యంగ్యము. ఒక్క రావణునిచే దేవతల అనుభావము, పరాక్రమము ఆక్రమింపబడుటకు ఉపమానముగా మానవులయొక్క సత్వము, రజస్సు ఒక్క తమస్సుచేత ఆక్రమింపబడుట చెప్పబడినది. రావణుడు తమస్సు, దేవతల యనుభావము సత్వము,

పరాక్రమము రజస్సు, తమస్సుచేత జీవుల సత్వ రజస్సులు ఆక్రమింపబడినట్లు రావణునిచేత దేవతల యనుభావ పరాక్రమములు ఆక్రమింపబడినవి అని ఉపమా లంకారము.

శ్లో॥ విదితం తప్యమానం చ
తేన మే భువనత్రయమ్
అకామోపనతేనేవ
సాధోర్హృదయ మేనసా. 40

పదవిభాగము : విదితం, తప్యమానం, చ, తేన, మే, భువనత్రయం, అకామోపనతేన, ఇవ, సాధోః, హృదయం, ఏనసా.

అన్వయము : అకామోపనతేన ఏనసా సాధోః హృదయం ఇవ తేన తప్యమానం భువనత్రయం చ మే విదితం.

అర్థము : అకామ = కోరకుండగనే; ఉపనతేన = పొందబడిన; ఏనసా = పాపముచేత; సాధోః = సజ్జనుని యొక్క; హృదయం-ఇవ = హృదయము వలె; తేన = ఆ రావణునిచే; తప్యమానం = బాధింపబడుచున్న; భువనత్రయం-చ = ముల్లోకములను గూర్చి కూడ; మే = నాకు; విదితం = తెలియును.

తాత్పర్యము : కోరకుండగనే సంక్రమించిన పాపముచేత సజ్జనుని హృదయమువలె రావణునిచే భువనత్రయము తపింపజేయబడుచున్నదని కూడ నాకు తెలియును.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : సాధువులు తెలిసిగాని తెలియకగాని పాపము చేయరు. ఐనను అన్యులు చేసిన పాపము ఒక్కొక్కప్పుడు సాధువుల హృదయమునకు సంతాపము కలిగించును. ఇట్లే రావణుడు విజృంభించి లోకములను తపింపజేయుటకు లోకములుచేసిన పాపము కారణముకాదు. కాని లోకముల యొక్క ప్రమత్తత కొంతవఱకు కారణము కావచ్చును. ఏలయన రావణుడు తపస్సు చేయుచున్నప్పుడు, రాక్షసస్వభావమెఱింగియుండిన యింద్రాదులు ఆ తపస్సునకు

భంగము కలిగించియుండవలసినది. లేదా సర్వదేవజాతులవల్లను మృత్యువులేదు అన్న వరము ఈయవద్దని బ్రహ్మను కోరియుండవలసినది. అప్పుడు ప్రమత్తులై యున్న కారణమువల్ల ఇప్పుడు కోరకుండగనే రావణునివల్ల ఉపద్రవము కలిగినది. ఈ యంశము విష్ణుదేవునకు విదితమే. రావణుని అంతమొందించు తరుణమునకై ఆయన ఎదురుచూచుచునే యుండెను.

భువనత్రయము రావణునిచే బాధింపబడుట సాధుహృదయము పాపముచే పీడింపబడుటతో పోల్చబడినది గనుక ఉపమాలంకారము.

శ్లో॥ కార్యేషు చైకకార్యత్వా
దభ్యర్థ్యోఽస్మి న వజ్రిణా
స్వయ మేవ హి వాతోఽగ్నే
స్సారథ్యం ప్రతిపద్యతే. 41

పద విభాగము : కార్యేషు, చ, ఏకకార్యత్వాత్, అభ్యర్థ్యః, అస్మి, న, వజ్రిణా, స్వయం, ఏవ, హి, వాతః, అగ్నేః, సారథ్యం, ప్రతిపద్యతే.

అన్వయము : కించ ఏకకార్యత్వాత్ కార్యేషు వజ్రిణా అభ్యర్థ్యః న అస్మి; తథాహి; వాతః స్వయం ఏవ అగ్నేః సారథ్యం ప్రతిపద్య తే.

అర్థము : కించ = మరేమనిన; ఏకకార్యత్వాత్ = ఏకప్రయోజనము కలవారమగుటవల్ల; కార్యేషు = కర్తవ్యములందు; వజ్రిణా = ఇంద్రునిచేత; అభ్యర్థ్యః = ప్రార్థింప దగినవాడను; న-అస్మి = కాను; తథాహి = అట్లే కదా; వాతః = వాయువు; స్వయం-ఏవ = స్వయముగానే; అగ్నేః = అగ్నికి; సారథ్యం = సాహాయ్యమును; ప్రతిపద్యతే = పొందును.

తాత్పర్యము : మరేమనగా ఇరువురము నేకప్రయోజనము గలవారమగుట వల్ల కర్తవ్యములందు ఇంద్రునిచే ప్రార్థింపబడవలసినవాడను గాను. వాయువు స్వయముగనే అగ్నికి సాహాయ్యము చేయును గదా.

అలంకారము : అర్థాంతరన్యాసము.

వ్యాఖ్యానము : విష్ణువు, ఇంద్రుడు లోకపాలనము కర్తవ్యముగా గల వారు. విష్ణువు చక్రాయుధము పట్టి చతుర్దశ భువనములను రక్షించుచుండును. ఇంద్రుడు వజ్రాయుధము పట్టి త్రిలోకములను పాలించుచుండును. త్రిలోకములు చతుర్దశ భువనములందే యిమిడి యున్నవి గనుక ఇంద్రుని కర్తవ్యము విష్ణుని కర్తవ్యమునందు భాగమే యగుచున్నది. ఇంద్రుడు స్వశక్తిచే లోకత్రయమును రక్షింపజాలనప్పుడు విష్ణువు పూనుకొని ఇంద్రునకు తోడ్పడును. కనుక రావణుని వల్ల త్రిలోకములకు ఉపద్రవము కలిగిన ఈ తరుణమున ఇంద్రుడు ప్రత్యేకముగా విష్ణువును ప్రార్థింప నక్కరలేదు. ఏకకార్య ప్రవణులు అప్రార్థితముగానే పరస్పరము సహకరించుకొందురు. ఈ యంశమును సమర్థించుటకు లోకప్రసిద్ధమైన యర్థాంతరము ప్రవేశపెట్టబడినది. వాయువు స్వయముగానే అగ్నికి సారథ్యము చేయును గదా యన్న యర్థముచే విష్ణువు స్వయముగానే ఇంద్రునకు తోడ్పడును అన్న యర్థము సమర్థింపబడినది. కనుక ఇది అర్థాంతరన్యాసాలంకారము.

శ్లో॥ స్వాసిధారా పరిహృతః
కామం చక్రస్య తేన మే
స్థాపితో దశమో మూర్ధా
లభ్యాంశ ఇవ రక్షసా. 42

పద విభాగము : స్వాసిధారా పరిహృతః, కామం, చక్రస్య, తేన, మే, స్థాపితః, దశమః, మూర్ధా, లభ్యాంశః, ఇవ, రక్షసా.

అన్వయము : స్వాసిధారా పరిహృతః దశమః మూర్ధా మే చక్రస్య కామం లభ్యాంశః ఇవ తేన రక్షసా స్థాపితః.

అర్థము : స్వ = తనయొక్క; అసిధారా = ఖడ్గధారచేత; పరిహృతః = విడిచిపెట్టబడిన; దశమః = పదియవదైన; మూర్ధా = శిరస్సు; మే = నాయొక్క; చక్రస్య = చక్రమునకు; కామం = నిశ్చయముగా; లభ్య-అంశః-ఇవ = పొందదగిన భాగమా యన్నట్లు; తేన-రక్షసా = ఆ రాక్షసునిచేత; స్థాపితః = ఉంచబడినది.

తాత్పర్యము : తన ఖడ్గధారచే పరిహరింపబడిన పదియవ శిరస్సు నా చక్రమునకు నిశ్చయముగా పొందదగిన భాగమో యన్నట్లు ఆ రావణాసురునిచే నిలువ యుంచబడినది.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : రావణుడు బ్రహ్మనుగూర్చి పదివేల యేండ్లు తపస్సు చేసెను. వేయేండ్ల కొకటి చొప్పున తన తలలను ఖండించి అగ్నియందు వ్రేల్చెను. పదియవ వేయి నిండి పదియవ తల ఖండింపబోగా బ్రహ్మ రావణునకు ప్రత్యక్షమయ్యెను. రావణుడు తన పది తలలలో తొమ్మిదింటిని తానే తన చంద్రహాసముతో ఖండించుకొని పదియవ తలను మాత్రము విడిచిపెట్టెను. అట్లు విడిచిపెట్టుట విష్ణువుకొఱకు దానిని నిలువ యుంచుటగా ఊహింపబడినది. నిజముగా రావణుడు తన పదవ శిరస్సును విష్ణువుకొఱకు నిలువ యుంచలేదు. నిలువ యుంచుటగా విష్ణువు భావించుచున్నాడు. కనుక ఇది ఉత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్ష విష్ణుదేవుని నిశ్చయమును – ఆ దశమ శిరస్సును నేను ఖండింతును అను దానిని వ్యక్తము చేయుచున్నది.

శ్లో॥ స్రష్టు ర్వరాతి సర్గా త్తు
మయా తస్య దురాత్మనః
అత్యారూఢం రిపో స్సోఢం
చందనేనేవ భోగినః. 43

పద విభాగము : స్రష్టుః, వరాతి సర్గాత్, తు, మయా, తస్య, దురాత్మనః, అత్యారూఢం, రిపోః, సోఢం, చందనేన, ఇవ, భోగినః.

అన్వయము : కింతు స్రష్టుః వరాతిసర్గాత్ మయా తస్య దురాత్మనః రిపోః అత్యారూఢం భోగినః (అత్యారూఢం) చందనేన ఇవ సోఢం.

అర్థము : కింతు = కాని; స్రష్టుః = బ్రహ్మయొక్క; వర + అతిసర్గాత్ = వరప్రదానమువల్ల; మయా = నాచేత; తస్య = ఆ; దురాత్మనః = దురాత్ముడైన; రిపోః = శత్రువుయొక్క; అత్యారూఢం = అతివృద్ధి; భోగినః = పాము

యొక్క; అత్యారూఢం = అతివృద్ధి; చందనేన-ఇవ = చందన వృక్షము చేతవలె; సోఢం = సహింప బడినది.

తాత్పర్యము : కాని బ్రహ్మయొక్క వరప్రదానము కారణముగా నాచేత దురాత్ముడైన ఆ శత్రువుయొక్క అభివృద్ధి సర్పముయొక్క అభివృద్ధి చందన వృక్షముచేత వలె సహింపబడినది.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : రావణుడు విశ్రవో బ్రహ్మ పుత్రుడు, పులస్త్య బ్రహ్మ పౌత్రుడు. పులస్త్యుడు బ్రహ్మ పుత్రుడు. కనుక రావణుడు బ్రహ్మకు మునిమనుమడు. వాడు ముత్తాతను గూర్చి తపస్సు చేయగా ఆయన ప్రసన్నుడై వానికి వరమిచ్చెను. ఆ వర బలమువల్ల వాడు గర్వించెను. ఆ వరమును మన్నించి విష్ణువు ఇంతవఱకు వాని దర్పమును, వృద్ధిని సహించెను. విధినియతిని విష్ణువైనను ఉల్లంఘింపరాదు. విష్ణువు రావణుని అతివృద్ధిని సహించుటకు సర్పముయొక్క అతివృద్ధిని చందన వృక్షము సహించుట ఉపమానముగా జూపబడినది. ఇదియు విధినియతియే. ఇచ్చట విష్ణువునకు చందన వృక్షము, రావణునకు సర్పము ఉపమానములని చెప్పుట కూడదు. విష్ణువు రావణుని వృద్ధిని సహించుట ఉపమేయము, చందనము సర్పము వృద్ధిని సహించుట ఉపమానము ఒక పదము యొక్క అర్థమునకు ఇంకొక పదముయొక్క అర్థము ఉపమానమైనచో ఉపమాలంకారము. ఇచ్చట ఒక పద సముదాయముయొక్క అర్థమునకు వేఱొక పద సముదాయము యొక్క అర్థము ఉపమానముగా జెప్పబడినది కనుక ఇది జయదేవుని మతమున స్తబకోపమ.

శ్లో॥ ధాతారం తపసా ప్రీతం
యయాచే స హి రాక్షసః
దైవాత్సర్గా దవధ్యత్వం
మర్త్యేష్వాస్థాపరాఙ్ముఖః. 44

పద విభాగము : ధాతారం, తపసా, ప్రీతం, యయాచే, స, హి, రాక్షసః, దైవాత్, సర్గాత్, అవధ్యత్వం, మర్త్యేషు, ఆస్థాపరాఙ్ముఖః.

అన్వయము : సః రాక్షసః తపసా ప్రీతం ధాతారం మర్త్యేషు ఆస్థా పరాఙ్ముఖః (సన్) దైవాత్ సర్గాత్ అవధ్యత్వం యయాచే హి.

అర్థము : సః-రాక్షసః = ఆ రావణాసురుడు; తపసా = తపస్సుచేత; ప్రీతం = సంతుష్టుడైన; ధాతారం = బ్రహ్మను; మర్త్యేషు = మానవుల విషయమందు; ఆస్థా-పరాఙ్ముఖః (సన్) = ఆదరములేనివాడై; దైవాత్ = దేవతా సంబంధమైన; సర్గాత్ = సృష్టివలన; అవధ్యత్వం = చంపరానిస్థితిని; యయాచే-హి = యాచించెనుగదా.

తాత్పర్యము : ఆ రావణాసురుడు తన తపస్సుచే సంతుష్టుడైన బ్రహ్మను మర్త్యుల విషయమున ఆదరము లేనివాడై దేవజాతివల్ల మృత్యువు లేని స్థితిని యాచించెనుగదా.

వ్యాఖ్యానము : "అమరత్వ మహం వృణే"-నేను అమరత్వమును గోరుచున్నానని రావణుడు తనకు ప్రత్యక్షమైన బ్రహ్మను వేడెను. బ్రహ్మ "నాస్తి సర్వామరత్వం తే"-నీకు శాశ్వతమైన అమరత్వము లేదని చెప్పెను. అప్పుడు రావణుడు దేవదానవ గంధర్వాదులచే మరణము లేకుండునట్లు వరమడిగెను. అల్ప మానవులు వానికి లెక్కలోనికి రాలేరి. బ్రహ్మ వానికి ఆ వరము ప్రసాదించెను. గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్య, విద్యాధర, యక్షులు దేవజాతులు. ఈ జాతులవారిచే మృత్యువు లేని స్థితి రావణునకు బ్రహ్మ వరమువల్ల లభించుటచేత దేవతలు వాని నేమియు చేయజాలరు. విష్ణువైనను విష్ణువుగానుండి వాని నేమియు చేయజాలడు. కనుక ఆయన రావణ వధకు ఉపాయము చింతించి యొక నిర్ణయమునకు వచ్చెను. అప్పుడు దేవతలాయన దర్శనమునకు వచ్చిరి.

శ్లో॥ సోఽహం దాశరథి ర్భూత్వా
రణభూమే ర్బలిక్షమమ్
కరిష్యామి శరై స్తీక్ష్ణై
స్తచ్ఛిరః కమలోచ్చయమ్. 45

పద విభాగము : సః, అహం, దాశరథిః, భూత్వా, రణభూమేః, బలిక్షమం, కరిష్యామి, శరైః, తీక్ష్ణైః, తచ్ఛిరః కమలోచ్చయం.

అన్వయము : సః అహం దాశరథిః భూత్వా తీక్ష్ణైః శరైః తచ్ఛిరః కమలోచ్చయం రణభూమేః బలిక్షమం కరిష్యామి.

అర్థము : సః-అహం = ఆ నేను; దాశరథిః = దశరథ పుత్రుడను; భూత్వా = అయి; తీక్ష్ణైః = తీవ్రములు యిన; శరైః = బాణములచేత; తత్ = ఆ రావణునియొక్క; శిరః కమల-ఉచ్చయం = శిరస్సు లనెడు కమలముల సమూహమును; రణ భూమేః = యుద్ధభూమికి; బలి-క్షమం = పూజాయోగ్యమును; కరిష్యామి = చేయగలను.

తాత్పర్యము : ఆ నేను దశరథుని పుత్రుడనై జన్మించి తీవ్రములైన బాణములచేత ఆ రావణుని శిరస్సు లనెడి కమలములను యుద్ధభూమికి పూజా యోగ్యములు చేయగలను.

అలంకారము : రూపకము.

వ్యాఖ్యానము : "సోహం" అనగా బ్రహ్మ వరము కారణముగా ఇంత వరకును రావణుని అతివృద్ధిని సహించిన నేను అని భావము. 42వ శ్లోకమున రావణుని పదియవ తల మాత్రమే విష్ణుని చక్రము పాలుగా ఉంచబడినట్లు వర్ణింపబడినది. ఇచ్చట "తచ్ఛిరః కమలోచ్చయం" - వాని శిరస్సు లనెడి కమలముల సముదాయము అని చెప్పబడినది. నిజమునకు రావణుని శిరస్సు విష్ణుచక్రముచే ఖండితము కాదు. శ్రీరాముని బాణముచే ఖండింపబడును. విష్ణువే దాశరథి యయ్యెను గనుక రామబాణము చక్రమే. రామబాణములకు రావణ కంఠ నాళములు కమలనాళ తుల్యములు. వాని శిరస్సులు కమలములు. ముఖమున కమలత్వారోపణము ప్రసిద్ధము. ఇచ్చట శిరస్సులందే కమలత్వారోపణము కలదు. పుష్పముల చేత పూజాకర్మ నిర్వర్తించుట సంప్రదాయము గనుక రణభూమికి పూజ గావించుటకు ఉచితముగా రావణుని శిరస్సులందు కమలత్వారోపణము.

శ్లో॥ అచిరా ద్యజ్వభిర్భాగం
కల్పితం విధివ త్పునః
మాయావిభి రనాలీఢ
మాదాస్యధ్వే నిశాచరైః. 46

పద విభాగము : అచిరాత్, యజ్వభిః, భాగం, కల్పితం, విధివత్, పునః, మాయావిభిః, అనాలీఢం, ఆదాస్యధ్వే, నిశాచరైః.

అన్వయము : యజ్వభిః విధివత్ కల్పితం భాగం మాయావిభిః నిశాచరైః అనాలీఢం అచిరాత్ పునః ఆదాస్యధ్వే.

అర్థము : యజ్వభిః = యాగకర్తలచేత; విధివత్ = యథావిధిగా; కల్పితం = కల్పింపబడిన; భాగం = హవిర్భాగమును; మాయావిభిః = మాయావులైన; నిశాచరైః = రాక్షసులచేత; అనాలీఢం = ఆక్రమింపబడకుండునట్లు; అచిరాత్ = త్వరలోనే; పునః = మరల; ఆదాస్యధ్వే = స్వీకరింపగలరు.

తాత్పర్యము : యాగకర్తలచే యథావిధిగా ఏర్పరుపబడిన హవిర్భాగమును మాయావులయిన రాక్షసులు ఆక్రమింపకుండునట్లుగా అచిరకాలములోనే మరల మీరు పొందగలరు.

వ్యాఖ్యానము : చిరకాలముగా దేవతలు రావణునివలన బాధ లనుభవించుచుండిరి. తమకు చెందవలసిన యాగ భాగములను రాక్షసు లపహరించుటవల్ల దేవతలకు సోమపానము కరవయ్యెను. ఈ బాధ యింక చిరకాల మనుభవింప నక్కరలేదు. దాశరథిగా అవతరించి మాయావులైన రాక్షసులను సంహరించి మీ యాగ భాగములు మీకు లభించునట్లు త్వరలోనే చేయుదునని ఆదిపురుషుడు దేవతలకు వాగ్దానము చేయుచున్నాడు.

దశరథునకు ఇప్పటికి అరువది యేండ్ల వయస్సు. ఆయనకు పూర్వమెప్పుడో జీవించిన అనరణ్య మహారాజును రావణుడు సంహరించి 'నా వంశమున జన్మించిన యొక మహాపురుషుని చేతిలో నీవు చత్తువు' అని శాపము పొందెను. అనగా దేవతలు రావణునివల్ల ఎన్నియో వేల సంవత్సరములుగా బాధ లనుభ

వించుచుండిరి. శ్రీరామచంద్రుడు తన ముప్పదియెనిమిదవ యేట రావణుని సంహరించును గనుక దేవతల బాధలు అచిరకాలముననే తీరగలవని విష్ణుదేవుని వచనము.

శ్లో॥ వైమానికాః పుణ్యకృత
స్త్యజంతు మరుతాం పథి
పుష్పకాలోక సంక్షోభం
మేఘావరణ తత్పరాః. 47

పద విభాగము : వైమానికాః, పుణ్యకృతః, త్యజంతు, మరుతాం, పథి, పుష్పకాలోక సంక్షోభం, మేఘావరణ తత్పరాః,

అన్వయము : మరుతాం పథి వైమానికాః మేఘావరణ తత్పరాః పుణ్యకృతః పుష్పకాలోక సంక్షోభం త్యజంతు.

అర్థము : మరుతాం-పథి = దేవతలయొక్క మార్గమైన ఆకాశమున; వైమానికాః = విమానములందు చరించువారై; మేఘ + ఆవరణ-తత్పరాః = మబ్బుల మాటున దాగ యత్నించు; పుణ్యకృతః = సుకృతులు; పుష్పక = పుష్పక విమానముయొక్క; ఆలోక = దర్శనమువల్ల గలుగు; సంక్షోభం = భయమును; త్యజంతు = వీడుదురు గాక.

తాత్పర్యము : ఆకాశమార్గమున విమానములందు సంచరించువారై మేఘముల మరుగున దాగ యత్నించు పుణ్యాత్ములు పుష్పక దర్శనమువలన గలుగు భీతిని వీడుదురు గాక.

వ్యాఖ్యానము : యాగాదులయిన పుణ్యకర్మ లొనర్చినవారు స్వర్గమున నివసింతురు. వారు విమానములపై విహరింతురు. ఆకాశ మార్గమున వారు విమానములపై విహరించునప్పుడు రావణుని పుష్పకము కనబడినచో వారు సంక్షోభమంది ఆత్మరక్షణార్థము దట్టమైన మేఘముల మరుగున దాగికొందురు. త్వరలో రావణుని సంహారము జరుగనున్నది గనుక అట్టివారింక నిర్భయముగా సంచరింపవచ్చును అని విష్ణుదేవుని యభయదానము.

శ్లో॥ మోక్ష్యథ స్వర్గబందీనాం
వేణీబంధా న దూషితాన్
శాపయంత్రిత పౌలస్త్య
బలాత్కార కచగ్రహైః. 48

పద విభాగము : మోక్ష్యథ, స్వర్గబందీనాం, వేణీబంధాన్, అదూషితాన్, శాపయంత్రిత పౌలస్త్య బలాత్కార కచగ్రహైః.

అన్వయము : శాపయంత్రిత పౌలస్త్య బలాత్కార కచగ్రహైః అదూషితాన్ స్వర్గబందీనాం వేణీబంధాన్ మోక్ష్యథ.

అర్థము : శాప = నలకూబర శాపముచే; యంత్రిత = నివారింపబడిన; పౌలస్త్య = రావణునియొక్క; బలాత్కార = బలాత్కారముచేనైన; కచగ్రహైః = కేశాకర్షణములచేత; అదూషితాన్ = మలినము గావింపబడని; స్వర్గబందీనాం = బందీకృతలైన స్వర్గస్త్రీలయొక్క; వేణీబంధాన్ = కేశ బంధములను; మోక్ష్యథ = విడిపింపగలరు.

తాత్పర్యము : నలకూబరుని శాపముచే నివారింపబడిన రావణుని బలాత్కారములచేనైన కేశాకర్షణములచేత కలుషితములు కాని బందీకృత స్వర్గాంగనల కేశబంధములను మీరు విడిపింపగలరు.

వ్యాఖ్యానము : రావణుడు వేలకొలది స్వర్గస్త్రీలను బలాత్కారముగా గొనిపోయి బంధించి యుంచెను. కేశ గ్రహణాదులవలన వారిని బలాత్కరించి చెఱచి యుండెడివాడే. కాని వానికి ఆకస్మికముగా ఒక శాపము సంభవించెను. ఒకనాడు రంభ యను అప్సరస చక్కగా అలంకరించుకొని తన ప్రియుడైన నలకూబరుని యొద్దకు బోవుచుండగా త్రోవలో ఆమె నడ్డగించి రావణుడు బలవంతముగా ఆమెతో సంభోగించెను. ఆ విషయము తెలిసి నలకూబరుడు 'పరస్త్రీని ముట్టినచో వెంటనే నీ శిరస్సు పగిలిపోవు'నని రావణుని శపించెను. ఈ శాపమునకు భయపడి రావణుడు తాను బంధించియుంచిన స్వర్గస్త్రీలను ముట్ట సాహసింపలేడు. సీతను గూడ వాడు స్పృశింపకుండుటకు ఈ శాపమే కారణము. రావణ మరణానంతరము దేవతలు బందీలై యున్న తమ స్త్రీల కేశబంధములను-రావణునిచే స్పృశింపబడి

మలినములు కానివానిని-విడిపింపవచ్చును. చిరకాలముగా సంస్కారము లేనందున పెనచుకొనిపోయిన ఆ కేశబంధములను విప్పవచ్చును. 46, 47, 48 శ్లోకములలో స్వర్గవాసులకు రావణునివల్ల గలిగిన బాధలు సూచింపబడినవి.

శ్లో॥ రావణావగ్రహాక్లాంత
మితి వాగమృతేన సః
అభివర్ష్య మరుత్సస్యం
కృష్ణమేఘ స్తిరో దధే. 49

పద విభాగము : రావణావగ్రహాక్లాంతం, ఇతి, వాగమృతేన, సః, అభివర్ష్య, మరుత్సస్యం, కృష్ణమేఘః, తిరోదధే.

అన్వయము : సః కృష్ణమేఘః రావణావగ్రహా క్లాంతం మరుత్సస్యం ఇతి వాగమృతేన అభివర్ష్య తిరోదధే.

అర్థము : సః = ఆ; కృష్ణ-మేఘః = విష్ణువనెడు మేఘము (నీల మేఘము); రావణ = రావణుడనెడి; అవగ్రహా = అనావృష్టిచే; క్లాంతం = వాడి పోయిన; మరుత్-సస్యం = దేవతలనెడి పైరును; ఇతి = ఈ విధమైన, వాక్ + అమృతేన = వాక్కులనెడి అమృతముచే; అభివర్ష్య = అభిషేకించి; తిరోదధే = అంతర్ధానము చెందెను.

తాత్పర్యము : ఆ విష్ణువనెడు మేఘము రావణుడనెడి అనావృష్టిచే శోషిల్లిన దేవతలనెడి పైరును ఈ విధమైన వాక్కులనెడి అమృతముచే అభిషేకించి యంతర్థానమందెను.

అలంకారము : రూపకము.

వ్యాఖ్యానము : ఐదవ శ్లోకమున నిదాఘముతో పోల్చబడిన రావణుడు ఈ శ్లోకమున అవగ్రహాముగా రూపింపబడినాడు. కనుక వానిచే పీడితులైన దేవతలందు సస్యత్వము ఆరోపింపబడినది. ఇందువల్ల విష్ణువునందు మేఘత్వము ఆయన వాక్యములందు అమృతత్వము ఆరోపింపబడినవి. విష్ణువు అవతరించి రావణుని సంహరించి దేవతలను కాపాడుదును అని పలుకుట యను వాక్య

మందలి యంగము లన్నింటి యందును మేఘము వర్షించి యనావృష్టి పీడితమైన సస్యమును రక్షించుట యను వాక్యమందలి యంగములన్నియు ఆరోపితములైనవి. విష్ణువునందు మేఘము, ఆయన వాక్యములందు అమృతము, దేవతలందు సస్యము, రావణునియందు అవగ్రహము— ఈ విధముగా సాంగమైన ఉపమేయమున సాంగమైన యుపమానము ఆరోపిత మగుటచే ఇది సాంగరూపకము - సావయవరూపకము. ఉపమేయ మందలి అంగము లన్నింటను ఆరోపణము శాబ్దముగా జరుగుటచే ఇది సమస్త వస్తువిషయము. మొత్తముపై ఇది సమస్త వస్తు విషయ సావయవ (సాంగ) రూపకము.

కృష్ణ మేఘము అనగా విష్ణువనెడు మేఘము అని వాచ్యార్థము. నల్లనైన మేఘము అని వ్యంగ్యార్థము. గర్జించి, వర్షించి మేఘము కరిగి పోయినట్లు విష్ణువు గంభీర ధ్వనితో అభయ వాక్యములు పలికి అంతర్హితుడయ్యెను.

శ్లో॥ పురుహూత ప్రభృతయ
స్సురకార్యోద్యతం సురాః
అంశై రనుయయు ర్విష్ణుం
పుష్పై ర్వాయు మివ ద్రుమాః. 50

పద విభాగము : పురుహూత ప్రభృతయః, సురకార్యోద్యతం, సురాః, అంశైః, అనుయయుః, విష్ణుం, పుష్పైః, వాయుం, ఇవ, ద్రుమాః.

అన్వయము : పురుహూత ప్రభృతయః సురాః సురకార్యోద్యతం విష్ణుం అంశైః ద్రుమాః పుష్పైః వాయుం ఇవ అనుయయుః.

అర్థము : పురుహూత-ప్రభృతయః = దేవేంద్రుడు మొదలుగా గల; సురాః = దేవతలు; సురకార్య = దేవకార్యమున; ఉద్యతం = సన్నద్ధుడైన; విష్ణుం = విష్ణువును; అంశైః = తమ యంశములచేత; ద్రుమాః = వృక్షములు; పుష్పైః = పూవులచేత; వాయుం-ఇవ = వాయువును వలె; అనుయయుః = అనుగమించిరి.

తాత్పర్యము : దేవేంద్రుడు మొదలుగా గల దేవతలు దేవకార్యమున ఉద్యుక్తుడైన విష్ణువును తమ తమ యంశములచేత, వృక్షములు పుష్పములచేత వాయువు ననుసరించినట్లు అనుసరించిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పై శ్లోకమున అంతర్హితుడైన విష్ణువు దాశరథిగా నవతరించుటకై యయోధ్యకు బోయెను. రావణ వధ కార్యమునం దాయనకు దోడ్పడుటకై దేవతలు తమ తమ యంశములతో ఆయన ననుసరించిరి. దేవతలు స్వర్గమునకే పోయిరి కాని వారి యంశములు మర్త్యలోకమునకు బోయి సుగ్రీవ హనుమదాది రూపములతో నవతరించెను. వాయువు వీచునప్పుడు వృక్షముల పుష్పములు వాయువు ననుసరించుట ఇచ్చట ఉపమానముగా చెప్పబడినది. ఇచ్చట విష్ణువు వాయువు, దేవతలు వృక్షములు, దేవతల యంశములు వృక్షముల యంశములైన పుష్పములు. రావణు డనెడు అవగ్రహముచే శుష్కించిన దేవతలనెడు వృక్షములు విష్ణువనెడు మేఘము వాక్కులనెడు అమృతము వర్షింపగా వెంటనే పుష్పించినవని ధ్వని. వర్షము కురిసి కరిగిపోయిన మేఘము కనబడదు. చల్లని గాలివలె వీచును. విష్ణువు అంతర్ధానము అట్లున్నది. ఆయన చల్లని గాలివలె మర్త్యలోకమునకు బోవుచుండగా పుష్పించిన వృక్షములవలె నున్న దేవతలు తాము ఉన్నచోటనే యుండి పుష్పములవంటి తమ యంశములతో ఆయనను అనుసరించిరి. పూర్వశ్లోక మందలి రూపకము ననుసరించి యీ శ్లోక మందలి ఉపమ రమ్యముగా దీర్చబడినది. విష్ణుదేవుడు మర్త్యలోకమున నవతరింపబోగా దివ్యపుష్పవర్షము గురిసిన దన్న ధ్వనియు నిందు పరిమళించుచున్నది.

శ్లో॥ అథ తస్య విశాంపత్యు
రంతే కామ్యస్య కర్మణః
పురుషః ప్రబభూ వాగ్నే
ర్విస్మయేన సహర్త్విజామ్. 51

పద విభాగము : అథ, తస్య, విశాంపత్యుః, అంతే, కామ్యస్య, కర్మణః, పురుషః, ప్రబభూవ, అగ్నేః, విస్మయేన, సహ, ఋత్విజాం.

అన్వయము : అథ తస్య విశాంపత్యుః కామ్యస్య కర్మణః అంతే అగ్నేః పురుషః ఋత్విజాం విస్మయేన సహ ప్రబభూవ.

అర్థము : అథ = అనంతరము; తస్య-విశాంపత్యుః = ఆ దశరథమహా రాజుయొక్క; కామ్యస్య-కర్మణః = పుత్రకామేష్టియొక్క; అంతే = అవసానమున; అగ్నేః = అగ్నినుండి; పురుషః = ఒకానొక పురుషుడు; ఋత్విజాం = యజ్ఞము చేయించువారియొక్క; విస్మయేన-సహ = ఆశ్చర్యముతోపాటు; ప్రబభూవ = పుట్టెను.

తాత్పర్యము : అనంతరమున ఆ దశరథమహారాజునకు సంబంధించిన పుత్రకామేష్టియొక్క అవసానమందు యాగాగ్నినుండి యాజకుల యాశ్చర్య భావముతోపాటు ఒక పురుషుడు ఆవిర్భవించెను.

అలంకారము : సహోక్తి.

వ్యాఖ్యానము : క్షీరసాగరమున శ్రీ మహావిష్ణువు దేవతలతో బలుకుచుండిన అభయ వాక్యములు ముగియునప్పటికి అయోధ్యయందు దశరథుని పుత్రకామేష్టియు ముగిసెను.

క్షీరసాగరమునందు అంతర్హితుడైన ఆ యాదిపురుషుడు క్షీరాన్నమున ప్రవేశించెను. క్షీరాన్నపాత్రమును రెండు చేతులతో ధరించి ప్రాజాపత్యపురుషుడు యాగాగ్నిమధ్యమున ఆవిర్భవించెను. ఋత్విక్కులెల్లరు ఆశ్చర్యపడిరి. ఎన్నియో యజ్ఞములు చేయించిన ఋత్విక్కులు ఇట్టి సంఘటనము నెన్నడును కని యెఱుంగరు. కనుక వారికి విస్మయము కలిగెను. యాగాగ్నినుండి యేదో మహాభూతము ఆవిర్భవింపబోవు లక్షణము కనబడగా ఋత్విజులు ఆసక్తితో దిలకించుచుండిరి. అగ్నినుండి పురుషుడు పుట్టుటయు, ఋత్విక్కులకు విస్మయము పుట్టుటయు ఏకకాలమున సంభవించెను. ప్రాజాపత్యపురుషుని యావిర్భావము ముందు జరుగును. అది కారణముగా ఋత్విజులకు విస్మయము కలుగును. కారణము తరువాత కార్యము స్వాభావికము. కారణ కార్యములు ఏకకాలమున సంభవింపవు. ఈ శ్లోకమున కారణ కార్యములకు సహభావము చెప్పబడుటచే ఇది సహోక్తి. సహోక్తియందు అతిశయోక్తి కలిసినప్పుడే దానికి అలంకారత్వము. కార్య కారణములు ఏకకాలమునం దావిర్భవించినవనుటయే అతిశయోక్తి. అది యాశ్చర్య జనకము.

శ్లో॥ హేమపాత్రగతం దోర్భ్యా
మాదధానః పయశ్చరుమ్
అనుప్రవేశా దాద్యస్య
పుంస స్తేనాపి దుర్వహామ్. 52

పద విభాగము : హేమపాత్రగతం, దోర్భ్యాం, ఆదధానః, పయశ్చరుం, అనుప్రవేశాత్, ఆద్యస్య, పుంసః, తేన, అపి, దుర్వహాం.

అన్వయము : ఆద్యస్య పుంసః అనుప్రవేశాత్ తేన అపి దుర్వహాం హేమ పాత్రగతం పయశ్చరుం దోర్భ్యాం ఆదధానః-(పురుషః అగ్నేః ప్రబభూవ.)

అర్థము : ఆద్యస్య = ఆద్యుడైన; పుంసః = పురుషునియొక్క; అనుప్రవేశాత్ = అధిష్ఠానమువలన; తేన + అపి = పాత్రధారియైన యాతనిచేతకూడ; దుర్వహాం = వహింప శక్యముగాని; హేమపాత్రగతం = బంగరు గిన్నెయం దున్న; పయశ్చరుం = పాయసాన్నమును; దోర్భ్యాం = రెండు చేతులతో; ఆదధానః = ధరించుచున్న-(పురుషుడు అగ్నినుండి ప్రభవించెను.)

తాత్పర్యము : ఆదిపురుషుడైన శ్రీ మహావిష్ణుని యధిష్ఠానమువల్ల అగ్నియందు పుట్టిన పురుషునకు గూడ వహింప శక్యముగాని బంగరు గిన్నెయందున్న పాయసాన్నమును రెండు చేతులతో ధరించుచున్నవాడై (యగ్నినుండి యొక పురుషుడు ప్రభవించెను అని వెనుకటి శ్లోకముతో అన్వయము.)

వ్యాఖ్యానము : ఆ పురుషుని చేతులలో హేమపాత్రమున్నది. అందులో పాయసమున్నది. ఆ పాయసములో ఆదిపురుషుడున్నాడు. ఆయనలో బ్రహ్మాండ మంతయు ఉన్నది. చూచుచున్నవారికి అది యొక హేమపాత్రమే కాని దానిని మోయుచున్న పురుషునకు దానిలో బ్రహ్మాండమంతయు నున్నదని తెలియును. కనుకనే అతడు దానిని రెండు చేతులతో పట్టుకొనియు మోయజాలకుండెను.

శ్లో॥ ప్రాజాపత్యోపనీతం త
దన్నం ప్రత్యగ్రహీన్నృపః
వృషేవ పయసాం సార
మావిష్కృత ముదన్వతా. 53

పద విభాగము : ప్రాజాపత్యోపనీతం, తత్, అన్నం, ప్రత్యగ్రహీత్, నృపః, వృషా, ఇవ, పయసాం, సారం, ఆవిష్కృతం, ఉదన్వతా.

అన్వయము : నృపః ప్రాజాపత్యోపనీతం తత్ అన్నం ఉదన్వతా ఆవిష్కృతం పయసాం సారం వృషా ఇవ ప్రత్యగ్రహీత్.

అర్థము : నృపః = దశరథమహారాజు; ప్రాజాపత్య = ప్రజాపతి సంబంధియైన పురుషునిచేత; ఉపనీతం = అందీయబడిన; తత్ = ఆ; అన్నం = పాయసాన్నమును; ఉదన్వతా = సముద్రునిచేత; ఆవిష్కృతం = బయట బెట్టబడిన; పయసాం = జలములయొక్క, పాలయొక్క; సారం = సారమైన యమృతమును; వృషా-ఇవ = ఇంద్రుడువలె; ప్రత్యగ్రహీత్ = ప్రతిగ్రహించెను.

తాత్పర్యము : ఆ దశరథమహారాజు ప్రాజాపత్య పురుషునిచే అందీయబడిన ఆ పాయసాన్నమును సముద్రునిచే బయటబెట్టబడిన యమృతమును ఇంద్రుడు వలె ప్రతిగ్రహించెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ప్రాజాపత్య పురుషుడు పయశ్చరుపూర్ణమైన ఆ హేమపాత్రమును తానే దశరథునకు అందజేసెను. దశరథుడు దానిని ప్రతిగ్రహించెను. వశిష్ఠ ఋశ్యశృంగాదులట్లే విస్మయావిష్టులై చూచుచుండిరి. సముద్రునిచే ఆవిష్కరింపబడిన అమృతమును దేవేంద్రుడు స్వయముగా ప్రతిగ్రహించుట ఉపమానముగా జెప్పబడినది. ప్రాజాపత్య పురుషునకు ఉదన్వంతుడు, ఆ చరుపాత్రమునకు అమృతకలశము, దశరథునకు దేవేంద్రుడు ఉపమానములు. సర్గారంభ శ్లోకమున "పాకశాసన తేజసః" అని దశరథుని గూర్చిన పాకశాసనౌపమ్యమును ఇట అనుసంధించుకొనవలెను.

శ్లో॥ అనేన కథితా రాజ్ఞో
గుణా స్తస్యాన్య దుర్లభాః
ప్రసూతిం చకమే తస్మిన్
త్రైలోక్య ప్రభవోఽపి యత్. 54

పద విభాగము : అనేన, కథితాః, రాజ్ఞః, గుణాః, తస్య, అన్యదుర్లభాః, ప్రసూతిం, చకమే, తస్మిన్, త్రైలోక్య ప్రభవః, అపి, యత్.

అన్వయము : తస్య రాజ్ఞః అన్యదుర్లభాః గుణాః అనేన కథితాః యత్ త్రైలోక్య ప్రభవః అపి తస్మిన్ ప్రసూతిం చకమే.

అర్థము : తస్య = ఆ దశరథ మహారాజుయొక్క; అన్య-దుర్లభాః = ఇతరులకు లభ్యములుగాని; గుణాః = గుణములు; అనేన = ఈ కారణముచేత; కథితాః = చెప్పబడినవి, స్పష్టబడినవి; యత్ = ఎందువల్ల ననగా; త్రైలోక్య = మూడులోకముల సమాహారమునకు; ప్రభవః-అపి = జన్మకారణమైన విష్ణువు కూడ; తస్మిన్ = ఆయనయందు; ప్రసూతిం = జన్మమును; చకమే = కోరెను.

తాత్పర్యము : ఆ దశరథ మహారాజుయొక్క అన్య దుర్లభములైన గుణములు దీనిచేత వ్యక్తము చేయబడినవి. ఎందువల్ల ననగా లోకత్రయమునకు జన్మహేతువైన విష్ణువుకూడ ఆతనియందు జన్మను కాంక్షించెను.

అలంకారము : కావ్య లింగము.

వ్యాఖ్యానము : రఘువంశ మహారాజు లందరును మహా గుణసంపన్నులు. కాని దశరథుని యందుగల మహా గుణములు తక్కినవారియందు లేవు అని యీ సన్నివేశము నిరూపించుచున్నది. త్రిభువన జనకుడైన శ్రీ మహావిష్ణువు తనకు జనకునిగా దశరథ మహారాజును ఎన్నుకొనెను. దశరథుని గుణములు, సుకృతములు ఇందువల్ల అనన్య దుర్లభములని తేలినది. మహా గుణసంపన్నులై వంశ కర్తృ గౌరవము నందిన ప్రభువులు ఈ సూర్య వంశమున జన్మించియుండగా దశరథుని గుణములు అన్య దుర్లభములని చెప్పుట సహేతుకమైన సమర్థనము నపేక్షించుచున్నది. అట్లు సమర్థించుటకై త్రిభువన జనకుడైన ఆది పురుషుడు దశరథుని జనకునిగా వరించుట హేతువుగా చూపబడినది. "సమర్థనీయ స్యార్థస్య కావ్యలింగం సమర్థనం" అను లక్షణము ననుసరించి సమర్థనీయమైన యర్థము హేతుపూర్వకముగా సమర్థింప బడినది గనుక ఇది కావ్యలింగాలంకారము.

శ్లో॥ స తేజో వైష్ణవం పత్న్యో
ర్విభేజే చరుసంజ్ఞితమ్
ద్యావా పృథివ్యోః ప్రత్యగ్ర
మహర్పతి రివాతపమ్. 55

పద విభాగము : సః, తేజః, వైష్ణవం, పత్న్యోః, విభేజే, చరుసంజ్ఞితం, ద్యావా పృథివ్యోః, ప్రత్యగ్రం, అహర్పతిః, ఇవ, ఆతపం.

అన్వయము : సః చరుసంజ్ఞితం వైష్ణవం తేజః పత్న్యోః ద్యావా పృథివ్యోః అహర్పతిః ప్రత్యగ్రం ఆతపం ఇవ విభేజే.

అర్థము : సః = ఆ దశరథుడు; చరు-సంజ్ఞితం = చరువను పేరుగల; వైష్ణవం = విష్ణుసంబంధమైన; తేజః = తేజస్సును; పత్న్యోః = ఇరువురు భార్యలకు; ద్యావాపృథివ్యోః = భూమ్యాకాశములు రెండింటికి; అహర్పతిః = సూర్యుడు; ప్రత్యగ్రం = క్రొత్తదైన; ఆతపం-ఇవ = ఎండనువలె; విభేజే = పంచి పెట్టెను.

తాత్పర్యము : ఆ దశరథుడు పాయసాన్నమను పేరుగల వైష్ణవ తేజమును తన భార్య లిరువురకు, సూర్యుడు భూమ్యాకాశములకు బాలాతపమును పంచిపెట్టినట్లు పంచిపెట్టెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ప్రాజాపత్య పురుషుడు దశరథున కిచ్చిన హేమ పాత్రము నందలి పదార్థమునకు యాగ పరిభాషలో చరువు అని పేరే తప్ప అది యథార్థముగా వైష్ణవ తేజము. పాయసము కేవలము ఉపాధి. దాని నధిష్ఠించి యున్నది వైష్ణవ తేజము. దశరథుడు పాయసమును తన యిరువురు భార్యలకు పంచి యిచ్చెననగా వైష్ణవ తేజమును పంచి యిచ్చెనన్నమాట. సూర్యుడు తన క్రొంగ్రొత్త వెలుగును ఆకాశమునకు భూమికి పంచి యిచ్చుట ఉపమానముగా జెప్ప బడినది. ఇచ్చట సూర్యవంశ ప్రభువైన దశరథుడు సూర్యుడు. వైష్ణవ తేజము సూర్యాతపము. దశరథుని పత్నులైన కౌసల్య, కైకేయీ క్రమముగా దివము, పృథ్వి.

గమనిక : "పత్నీభ్యః" అనుటచే దశరథుడు పాయసాన్నమును కౌసల్య, కైకేయి యను ఇరువురు భార్యలకే తొలుత పంచియిచ్చినట్లు కాళిదాసు చెప్పు చున్నాడు. కౌసల్య పట్టమహిషి, కైకేయి ప్రేయసి కనుక ఆ యిరువురకే ముందు పంచి యిచ్చెనని కాళిదాసు అభిప్రాయము కావచ్చును. కాని యీ పంపకము వాల్మీకమునకు విరుద్ధము.

"కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా
అర్ధార్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః

కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థ కారణం
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమం

అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్."

దశరథుడు పాయసమున అర్ధభాగము కౌసల్యకు, మిగిలిన దానిలో అర్ధ భాగము సుమిత్రకు, మిగిలిన దానిలో అర్ధభాగము కైకేయికి ఇచ్చి అప్పటికి మిగిలిన దానిని మరల సుమిత్రకు ఇచ్చినట్లు వాల్మీకి చెప్పెను.

"కౌసల్యాఽజనయత్ రామం దివ్యలక్షణ సంయుతం
విష్ణోరర్ధం మహాభాగం పుత్ర మిక్ష్వాకు నందనం"

అని శ్రీరాముడు విష్ణువు అర్ధాంశమున జన్మించినట్లును

"భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్య పరాక్రమః
సాక్షా ద్విష్ణోః చతుర్భాగః సర్వైస్సముదితో గుణైః"

అని భరతుడు విష్ణువు చతుర్థాంశమున జన్మించినట్లును వాల్మీకి చెప్పియుండుట ఆయన చెప్పిన పాయస విభాగమునకు అనుగుణముగా లేనందున "అర్ధ" శబ్దము నకు సగము అని చెప్పక "అంశము, ఖండము" అని యర్థము చెప్పి సరిపెట్టు కొనవలయును. ఈ యంశమెట్లున్నను పాయసవిభాగ విధానమున కాళిదాసుమాట వాల్మీకి మాటతో భేదిల్లుచున్నది.

శ్లో॥ అర్చితా తస్య కౌసల్యా
ప్రియా కేకయ వంశజా
అత స్సంభావితాం తాభ్యాం
సుమిత్రా మైచ్ఛ దీశ్వరః. 56

పద విభాగము : అర్చితా, తస్య, కౌసల్యా, ప్రియా, కేకయవంశజా, అతః, సంభావితాం, తాభ్యాం, సుమిత్రాం, ఐచ్ఛత్, ఈశ్వరః.

అన్వయము : తస్య కౌసల్యా అర్చితా కేకయవంశజా ప్రియా; అతః ఈశ్వరః సుమిత్రాం తాభ్యాం సంభావితాం ఐచ్ఛత్.

అర్థము : తస్య = ఆ దశరథునకు; కౌసల్యా = కౌసల్య; అర్చితా = పూజింపదగినది; కేకయ-వంశజా = కైకేయి; ప్రియా = ప్రియురాలు; అతః = అందువల్ల; ఈశ్వరః = ప్రభువైన దశరథుడు; సుమిత్రాం = సుమిత్రను; తాభ్యాం = ఆ యిరువురిచేత; సంభావితాం = సమ్మానితనుగా; ఐచ్ఛత్ = కోరెను.

తాత్పర్యము : ఆ దశరథునకు కౌసల్య పూజ్యురాలు, కైకేయి ప్రియురాలు. అందువల్ల ఆ ప్రభువు సుమిత్రను ఆ యిరువురిచేత సమ్మానితురాలిని గావింపవలెనని యపేక్షించెను.

వ్యాఖ్యానము : దశరథుడు పాయసమును కౌసల్యకు, కైకేయికి మాత్రమే యిచ్చుటకు కారణము ఇచ్చట చెప్పబడినది. కౌసల్య అగ్రమహిషి గనుక దశరథునకు మాన్యురాలు. కైకేయి కడగొట్టు భార్య గనుక ఆయనకు ప్రియురాలు. ఈ విధముగా తన మన్ననకు, ప్రేమకు పాత్రురాండ్రయిన ఆ యిద్దరకు తన చేతిమీదుగా పాయసము పంచి, ఆ యిద్దరిచేత సుమిత్రకు ఇప్పించుట దశరథుని హృద్గతమైన యభిప్రాయము. ఇందువల్ల సుమిత్రపట్ల దశరథునకు ఉపేక్షాభావమని భావింపరాదు. మాన్యురాలైన కౌసల్యచేత, ప్రియురాలైన కైకేయిచేత కూడ ఇప్పించుటవల్ల తనకు సుమిత్రపట్ల మాన్యత, ప్రేమ రెండును గలవని దశరథుడు వ్యక్తము చేసినట్లయినది. తానై యీయక వారిద్దరిచేత ఇప్పించుటవల్ల తనకు వారిపట్ల గల భావమే కాక సుమిత్రకు మిగిలిన యిరువురిపట్ల, ఆ యిరు

పురకు సుమిత్రపట్లగల భావమును గూడ వెల్లడి యగునట్లు చేయుట దశరథుని ఆశయము. ఆ యిరువురిచేత సుమిత్రను సమ్మానితురాలిని గావింపవలెనని దశరథుడు కోరినట్లు చెప్పబడినది గదా. కౌసల్యకు, కైకేయికి ఒక్కొక్క పుత్రుడు, సుమిత్రకు ఇరువురు పుత్రులు జన్మింపవలెనని దశరథుని భావముగా ఊహింపదగును. ఈ తీరున ముప్వురకు పాయసమున భాగము లభించునట్లు చేసి దక్షిణ నాయకుడైన దశరథుడు ఉచితజ్ఞతను, కౌశలమును ప్రదర్శించెను.

శ్లో॥ తే బహుజ్ఞస్య చిత్తజ్ఞే
పత్న్యౌ పత్యు ర్మహీక్షితః
చరో రర్ధార్ధభాగాభ్యాం
తా మయోజయతా ముభే. 57

పద విభాగము : తే, బహుజ్ఞస్య, చిత్తజ్ఞే, పత్న్యౌ, పత్యుః, మహీక్షితః, చరోః, అర్ధార్ధ భాగాభ్యాం, తాం, అయోజయతాం, ఉభే

అన్వయము : బహుజ్ఞస్య మహీక్షితః పత్యుః చిత్తజ్ఞే ఉభే పత్న్యౌ చరోః అర్ధార్ధ భాగాభ్యాం తాం అయోజయతాం.

అర్థము : బహుజ్ఞస్య = పెక్కు విషయములు తెలిసిన; మహీక్షితః = రాజైన; పత్యుః = భర్తయైన దశరథునియొక్క; చిత్తజ్ఞే = మనస్సు నెఱిగిన; ఉభే = ఆ యిరువురు; పత్న్యౌ = భార్యలును; చరోః = పాయసాన్నముయొక్క; అర్ధార్ధ భాగాభ్యాం = సగము సగము భాగములతో; తాం = ఆ సుమిత్రను; అయోజయతాం = కూడినదానినిగా చేసిరి.

తాత్పర్యము : పెక్కు విషయములు తెలిసిన భూపతి యగు తమ భర్త చిత్తము నెఱింగిన ఆ యిరువురు భార్యలును సుమిత్రను చరువుయొక్క సగము సగము భాగములతో గూడినదానినిగా నొనర్చిరి. (తమ వంతు పాయసములో సగము సగము సుమిత్ర కిచ్చిరని తాత్పర్యము.)

వ్యాఖ్యానము : దశరథుని చిత్తము ఆయన భార్యలకును, వారి చిత్తములు ఆయనకును బాగుగా దెలియును. కనుక కౌసల్య, కైకేయి భర్తృ హృదయమును

గ్రహించి వెంటనే తమ వంతుకు వచ్చిన చరు భాగములలోనుండి కొంత కొంత భాగము తీసి సుమిత్రకు నిచ్చిరి. అర్ధార్ధ భాగాభ్యాం అనగా సగము సగము భాగములతో అని యర్థము వచ్చును. కాని అర్ధ శబ్దము పుంలింగమైనప్పుడు శకలమని యర్థము. నపుంసక లింగమైనప్పుడే సగమని యర్థము వచ్చును. అర్ధము అనగా సగము అని యర్థము చెప్పినచో కౌసల్య, కైకేయి తమకు దశరథుడిచ్చిన దానిలో సగము చొప్పున సుమిత్ర కిచ్చినట్లగును. అనగా సుమిత్రకు మొత్తము పాయసములో సగము లభించినట్లగును. ఇది వాల్మీకి రామాయణమునకు విరుద్ధ మగును. కనుక వారి వంతుకు లభించినదానిలో కొంత భాగమును (శకలమును) ఇచ్చిరన్నచో విరోధము పరిహృతమగును. వాల్మీకి రామాయణమునందును 'అర్ధం దదౌ' అనియే యున్నది. ఇచ్చట అర్ధమనగా శకలమని, సగమని రెండర్థములు చెప్పవలసి యున్నది.

కౌసల్యకు అర్ధమిచ్చె ననగా సగమిచ్చెను. మిగిలినదానిలో అర్ధము అనగా ఒక శకలము సుమిత్ర కిచ్చెను. మిగిలినదానిలో అర్ధము అనగా ఒక శకలము కైకేయి కిచ్చి శేషించిన అర్ధము అనగా శకలము మరల సుమిత్ర కిచ్చెను.

"భరతోనామ కైకేయ్యాం జజ్ఞే సత్య పరాక్రమః
సాక్షా ద్విష్ణో చతుర్భాగః"

ఇట 'చతుర్భాగః' అనగా నాల్గవ వంతు అని కాక నాల్గవ అంశము అని చెప్పవలెను. 'విష్ణో రర్ధ సమన్వితౌ' అనగా లక్ష్మణ శత్రుఘ్నులు విష్ణ్వంశ సమన్వితులు అని యర్థము చెప్పవలెను. శ్రీరామునిగూర్చి 'విష్ణో రర్ధం' అన్న చోట మాత్రము అర్ధ శబ్దమును సమభాగవాచిగా గ్రహించుట ఉచితముగా నుండును.

శ్లో॥ సాపి ప్రణయవత్యాసీ
త్సపత్న్యో రుభయో రపి
భ్రమరీ వారణస్యేవ
మదనిష్యంద లేఖయోః. 58

పద విభాగము : సా, అపి, ప్రణయవతీ, ఆసీత్, సపత్న్యోః, ఉభయోః, అపి, భ్రమరీ, వారణస్య, ఇవ, మదనిష్యంద లేఖయోః.

అన్వయము : సా అపి ఉభయో రపి సపత్న్యో భ్రమరీ వారణస్య మద నిష్యందలేఖయోః ఇవ ప్రణయవతీ ఆసీత్.

అర్థము : సా-అపి = ఆ సుమిత్రయు; ఉభయోః-అపి = ఇరువురైన; సపత్న్యోః = సవతులందు కూడ; భ్రమరీ = ఆడుతుమ్మెద; వారణస్య = ఏనుగు యొక్క; మద-నిష్యంద-లేఖయోః-ఇవ = మదము కారుటచే నేర్పడిన చారల యందు వలె; ప్రణయవతీ = ప్రేమ గలది; ఆసీత్ = ఆయెను.

తాత్పర్యము : ఆ సుమిత్రయు ఇరువురు సవతులందును ఆడుతుమ్మెద యేనుగుయొక్క మదము కారగా నేర్పడిన చారికలందు వలె ప్రేమ గలది యయ్యెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : దివ్యమైన పాయసము సవతు లిరువురకు లభించినది, తనకు లేకపోయినదని సుమిత్ర అసూయ పడవచ్చును. కాని పతి హృదయ మామెకుగూడ తెలియును గనుక ఆమె యసూయ పడలేదు. కౌసల్య, కైకేయి ఆమె అసూయ పడుటకు అవకాశముకూడ ఈయలేదు. వెంటనే తమకు లభించిన భాగములనుండి యామెకు కూడ చెరికొంత పంచి యిచ్చిరి. ఆమె వారిరువురి యందు ప్రీతిగలదైనది. ఇందుకు ఉపమానముగా ఆడుతుమ్మెద ఏనుగు మదధార లందు ప్రీతిగలదగుట పేర్కొనబడినది. ఇచ్చట దశరథుడు ఏనుగు. కౌసల్య, కైకేయి ఏనుగు చెక్కిళ్ళనుండి స్రవించు మదధారలు. సుమిత్ర భ్రమరి. ఈ యుపమానమువల్ల దశరథునితో కౌసల్యకు, కైకేయికి సమవాయ సంబంధము, సుమిత్రకు సంయోగ సంబంధము సూచితమై ఆమె సవతు లిద్దరికంటె పతికి కొంచెము ఎడ యగుట ధ్వనించుచున్నది.

శ్లో॥ తాభి ర్గర్భః ప్రజాభూత్యై
దధ్రే దేవాంశ సంభవః
సౌరీభి రివ నాడీభి
రమృతాఖ్యాభి రమ్మయః. 59

పద విభాగము : తాభిః, గర్భః, ప్రజాభూత్యై, దధ్రే, దేవాంశ సంభవః, సౌరీభిః, ఇవ, నాడీభిః, అమృతాఖ్యాభిః, అమ్మయః.

అన్వయము : తాభిః ప్రజాభూత్యై దేవాంశ సంభవః గర్భః సౌరీభిః అమృతాఖ్యాభిః నాడీభిః అమ్మయః గర్భః ఇవ దధ్రే.

అర్థము : తాభిః = ఆ ముప్వురు రాణులచేత; ప్రజా-భూత్యై = ప్రజల యభ్యుదయముకొఱకై; దేవ + అంశ-సంభవః = విష్ణుదేవుని యంశములవల్ల బుట్టిన; గర్భః = గర్భము; సౌరీభిః = సూర్యసంబంధములైన; అమృతాఖ్యాభిః = అమృతము లను పేరుగల; నాడీభిః = నాళములచేత; అప్ + మయః = జలమయమైన; గర్భః-ఇవ = గర్భమువలె; దధ్రే = ధరింపబడెను.

తాత్పర్యము : ఆ ముప్వురు రాణులచేత ప్రజల యభ్యుదయముకొఱకై విష్ణుని యంశమువల్ల నేర్పడిన గర్భము సూర్య సంబంధములై యమృతము లను పేరుగల నాళికలచేత జలమయమైన గర్భము ధరింపబడినట్లు ధరింపబడెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : కౌసల్యాదులు ధరించిన గర్భములు దేవాంశ సంభవములు. వానివల్ల జన్మించిన శ్రీరామచంద్రాదులు రావణాది రాక్షసులను సంహరింతురు గనుక కౌసల్యాదులు గర్భము ధరించుట రఘువంశ విభూతికొఱకే కాక సర్వ ప్రజల యభ్యుదయముకొఱకు అగుచున్నది. సూర్య సంబంధములైన నాళిక లనగా సూర్య కిరణములు. వానిలో జలము వర్షించు కిరణములకు అమృతములని పేరు. అవి ప్రజల యభ్యుదయముకొఱకై జలమయములైన గర్భములు ధరించినట్లు కౌసల్యాదులు గర్భములు ధరించిరని ఉపమాలంకారము. ఈ యలంకారమువల్ల దశరథునియందు సూర్యౌపమ్యము గమ్యము.

శ్లో॥ సమ మాపన్నసత్వా స్తా
బభు రాపాండురత్విషః
అంతర్గత ఫలారంభా
స్సస్యానా మివ సంపదః. 60

పద విభాగము : సమం, ఆపన్న సత్వాః, తాః, బభుః, ఆపాండురత్విషః, అంతర్గత ఫలారంభాః, సస్యానాం, ఇవ, సంపదః.

అన్వయము : సమం ఆపన్న సత్వాః ఆపాండుర త్విషః తాః అంతర్గత ఫలారంభాః సస్యానాం సంపదః ఇవ బభుః.

అర్థము : సమం = ఏకకాలమున; ఆపన్న-సత్వాః = గర్భవతులై; ఆపాండుర-త్విషః = ఇంచుక తెల్లనికాంతిగల; తాః = ఆ రాణులు ముప్వురు; అంతర్గత = లోపలనున్న; ఫల-ఆరంభాః = ఫలముయొక్క ఉత్పత్తిగల; సస్యానాం = పైరులయొక్క; సంపదః-ఇవ = సంపదలువలె; బభుః = ప్రకాశించిరి.

తాత్పర్యము : ఏక కాలమున గర్భవతులై ఇంచుక తెల్లని కాంతి వహించిన యా రాణులు ముప్వురును గుప్తముగానున్న ఫలోత్పత్తిగల సస్యముల సంపదలవలె ప్రకాశించిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పై శ్లోకమున జలగర్భములైన యమృతాఖ్య సౌరనాడులతో పోల్పబడిన కౌసల్యాదు లిందు ఫలగర్భములైన సస్య సంపదలతో పోల్పబడినారు. ఈ ఉపమయు వారి గర్భధారణము లోకాభ్యుదయము కొఱకే యని వ్యక్తము చేయుచున్నది. గర్భవతులు పాలిపోవుట సహజము. సస్యము ఈన మోసినప్పుడు తెలుపురంగు తిరుగుట సహజము. సౌరనాడులందలి గర్భము కేవల ద్రవపదార్థము. సస్యముల గర్భము ఘన పదార్థముగా పరిణమించు దశయందుండును. ఈ యుపమానములందలి మార్పు కౌసల్యాదుల గర్భముల పరిణామమును వ్యక్తము చేయును.

శ్లో॥ గుప్తం దదృశు రాత్మానం
సర్వా స్స్వప్నేషు వామనైః
జలజాసిగదా శార్ఙ్గ
చక్రలాంఛిత మూర్తిభిః. 61

పద విభాగము : గుప్తం, దదృశుః, ఆత్మానం, సర్వాః, స్వప్నేషు, వామనైః, జలజాసి గదా శార్ఙ్గ చక్రలాంఛిత మూర్తిభిః.

అన్వయము : సర్వాః స్వప్నేషు జలజాసి గదా శార్ఙ్గ చక్రలాంఛిత మూర్తిభిః వామనైః గుప్తం ఆత్మానం దదృశుః.

అర్థము : సర్వాః = రాణులెల్లరును; స్వప్నేషు = స్వప్నములందు; జలజ-అసి-గదా-శార్ఙ్గ-చక్ర-లాంఛిత-మూర్తిభిః = శంఖ, ఖడ్గ, గదా, చాప, చక్రములచే చిహ్నితములైన మూర్తులు గల; వామనైః = హ్రస్వ పురుషులచేత; గుప్తం = రక్షింపబడిన; ఆత్మానం = స్వరూపమును (తన రూపమును); దదృశుః = చూచిరి.

తాత్పర్యము : ఆ ముప్వురు రాణులును స్వప్నములందు శంఖ ఖడ్గ గదా చాప చక్రములచే అలంకృత మూర్తులయిన వామనులచే రక్షింపబడిన తమ రూపములను దర్శించిరి.

వ్యాఖ్యానము : దివ్యమైన పాయసమును భక్షించి గర్భము ధరించిన ఆ రాణులు ముప్వురును తమకు జన్మింపబోవు సంతానమును గూర్చి యాశ్చర్యకరములైన స్వప్నములు కాంచసాగిరి. ముప్వురు ఒకే పాయసము భుజించి యొకే కాలమున గర్భములు ధరించుటచే ముప్వురకును ఒకే విధమైన స్వప్నములు వచ్చుచుండెను. శంఖ చక్రాది లాంఛితులైన వామన మూర్తులు బాల విష్ణు మూర్తులు. అందరి గర్భము లందును ఉన్నవి విష్ణ్వంశములే కనుక అందరకును ఒకే రూపము స్వప్న గోచరమైనది.

శ్లో॥ హేమపక్ష ప్రభా జాలం
గగనే చ వితన్వతా
ఊహ్యాంతే స్మ సుపర్ణేన
వేగాకృష్ట పయోముచా. 62

పద విభాగము : హేమపక్ష ప్రభాజాలం, గగనే, చ, వితన్వతా, ఊహ్యాంతే, స్మ, సుపర్ణేన, వేగాకృష్ట పయోముచా.

అన్వయము : కించ హేమపక్షప్రభాజాలం వితన్వతా వేగాకృష్ట పయో ముచా సుపర్ణేన గగనే ఉహ్యంతే స్మ.

అర్థము : కించ = మఱియును; హేమ-పక్ష = బంగరు ఱెక్కలయొక్క; ప్రభా-జాలం = కాంతి పుంజమును; వితన్వతా = విస్తరింపజేయు చున్నట్టియు; వేగ = వేగముచే; ఆకృష్ట = ఈడ్వబడుచున్న; పయోముచా = మేఘములు గలట్టియు; సుపర్ణేన = గరుత్మంతునిచే; గగనే = ఆకాశమందు; ఉహ్యంతే-స్మ = (వారు) మోయబడుచుండిరి.

తాత్పర్యము : మఱియు ఆ రాణులు బంగరు ఱెక్కల కాంతులను ప్రసరింప జేయుచు, వేగమువల్ల ఆకర్షింప బడుచున్న మేఘములుగల గరుత్మంతునిచే ఆకాశమున మోసికొని పోబడుచుండిరి.

వ్యాఖ్యానము : ఇది యింకొక స్వప్న దర్శనము. విష్ణుదేవుడు వారి గర్భములందుండెను గనుక ఆ దేవుని వాహనమైన గరుడడు ఆ రాణులను తన రెక్కలపై నెక్కించుకొని గగనమున విహరింపసాగెను. తన స్వామిని సేవించు చుంటినని తృప్తి పడెను. భంగ్యంతరమున - తన ప్రభువైన విష్ణువే ఆ రాణులను రక్షకుడై సేవించుచుండుటచే గరుడడుకూడ వారిని సేవింప బూనెను.

శ్లో॥ బిభ్రత్యా కౌస్తుభన్యాసం
స్తనాంతర విలంబినమ్
పర్యుపాస్యంత లక్ష్మ్యా చ
పద్మవ్యజన హస్తయా. 63

పద విభాగము : బిభ్రత్యా, కౌస్తుభన్యాసం, స్తనాంతర విలంబినం, పర్యుపాస్యంత, లక్ష్మ్యా, చ, పద్మవ్యజనహస్తయా.

అన్వయము : కించ స్తనాంతర విలంబినా కౌస్తుభన్యాసం బిభ్రత్యా పద్మ వ్యజనహస్తయా లక్ష్మ్యా పర్యుపాస్యంత.

అర్థము : కించ = మఱియును; స్తన + అంతర = స్తనముల నడిమి ప్రదేశమున; విలంబినం = వ్రేలాడుచున్న; కౌస్తుభ-న్యాసం = కౌస్తుభ మనెడు

నిక్షేపమును; బిభ్రత్యా = ధరించుచున్నదియు; పద్మ = కమల మనెడు; వ్యజన = విసనకఱ్ఱ; హస్తయా = హస్తమునందు గలదియు నైన; లక్ష్మ్యా = లక్ష్మిచేత; పర్యుపాస్యంత = సేవింపబడుచుండిరి.

తాత్పర్యము : మఱియును ఆ మువ్వురు రాణులును, స్తనముల మధ్య వ్రేలాడుచున్న కౌస్తుభ మనెడు నిక్షేపమును ధరించినదియు, పద్మ మనెడు వీవన హస్తమునందు గలదియు నగు లక్ష్మిచేత సేవింపబడుచుండిరి.

అలంకారము : రూపకము.

వ్యాఖ్యానము : ఇది మరియొక కల. విష్ణుదేవుడు భూలోకమున అవతరింప వచ్చుచు తన వక్షస్థలమందలి కౌస్తుభమణిని దీసి లక్ష్మీదేవికి భద్రపఱుప నిచ్చెను. అది యామె విలాస దర్పణముగదా. దానిని ఆమె భద్రముగా తన స్తనముల నడుమ వ్రేలాడునట్లుంచుకొనెను – విష్ణువు ఉంచుకొన్నట్లే. పతి యలంకారమును వక్షమునందుంచుకొని పతియే తన వక్షమునందున్నట్లు లక్ష్మి మురియుచుండెనని వ్యంగ్యము. శిశురూపమున తన పతి దశరథ పత్నుల గర్భములందుండెను. కాబోవు జననులను ఆయనయే వామనమూర్తులు దాల్చి సేవించుచుండెను. తనకు కాబోవు అత్తలు గనుక లక్ష్మీదేవియు గర్భభారాలసలైన యా రాణులను పద్మ వ్యజనముతో విసరుచు సేవించుచుండెను. కౌస్తుభమున న్యాసత్వము ఆరోపింపబడుటచే రూపకము.

శ్లో॥ కృతాభిషేకై ర్దివ్యాయాం
త్రిస్రోతసి చ సప్తభిః
బ్రహ్మర్షిభిః పరం బ్రహ్మ
గృణద్భి రుపతస్థిరే. 64

పద విభాగము : కృతాభిషేకైః, దివ్యాయాం, త్రిస్రోతసి, చ, సప్తభిః, బ్రహ్మర్షిభిః, పరం, బ్రహ్మ, గృణద్భిః, ఉపతస్థిరే.

అన్వయము : కించ దివ్యాయాం త్రిస్రోతసి కృతాభిషేకైః పరం బ్రహ్మ గృణద్భిః సప్తభిః బ్రహ్మర్షిభిః ఉపతస్థిరే.

అర్థము : కించ = మఱియును; దివ్యాయాం = దివ్యమైన; త్రిస్రోతసి = ఆకాశగంగయందు; కృత + అభిషేకైః = చేయబడిన స్నానము గలవారును; పరం = ఉత్కృష్టమైన; బ్రహ్మ = వేద రహస్యమును; గృణద్భిః = పలుకు చున్నవారును నైన; సప్తభిః-బ్రహ్మర్షిభిః = సప్త మహర్షులచేత; ఉపతస్థిరే = ఉపాసింపబడుచుండిరి.

తాత్పర్యము : మఱియును ఆ ముప్పురు రాణులు దివ్యమైన యాకాశగంగ యందు చేయబడిన స్నానము గలవారును, ఉత్కృష్టమైన వేద రహస్యమును పలుకుచున్నవారును నైన సప్తమహర్షులచే ఉపాసింపబడుచుండిరి.

వ్యాఖ్యానము : దశరథ పత్నుల గర్భములందున్న విష్ణువు ఉపనిషత్సార మైన బ్రహ్మపదార్థము. సప్తమహర్షులు ఆకాశగంగా స్నాతులై వచ్చి వేదార్థము నుపన్యసించుచు కౌసల్యాదులను ఉపాసించుచుండిరి. ఇది చివరి స్వప్నము. మొదటి మూడు స్వప్నములందు వైకుంఠ నిలయుడైన పరమపురుషుని వైభవము చిత్రింపబడినవి. దీనియందు ఆ పరమపురుషుడు పరమాత్మ యన్న పరమార్థము సూచింపబడినది.

సప్త మహర్షులు : అత్రి, భృగువు, కుత్సుడు, కపిలుడు, గౌతముడు, కశ్యపుడు, అంగిరసుడు అనువారు. మరియొక లెక్క ప్రకారము - మరీచి, అంగి రసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు, గౌతముడు అను వీ యేడుగురు బ్రహ్మర్షులు.

శ్లో॥ తాభ్య స్తథా విధాం స్త్వప్నాన్
శ్రుత్వా ప్రీతోఽథ పార్థివః
మేనే పరార్థ్య మాత్మానం
గురుత్వేన జగద్గురోః. 65

పద విభాగము : తాభ్యః, తథా విధాన్, స్వప్నాన్, శ్రుత్వా, ప్రీతః, అథ, పార్థివః, మేనే, పరార్థ్యం, ఆత్మానం, గురుత్వేన, జగద్గురోః.

అన్వయము : అథ పార్థివః తాభ్యః తథా విధాన్ స్వప్నాన్ శ్రుత్వా ప్రీతః (సన్) ఆత్మానం జగద్గురోః గురుత్వేన పరార్ధ్యం మేనే.

అర్థము : అథ = అనంతరము; పార్థివః = దశరథుడు; తాభ్యః = ఆ రాణులవలన; తథా విధాన్ = ఆ విధములైన; స్వప్నాన్ = స్వప్నములను గూర్చి; శ్రుత్వా = విని; ప్రీతః (సన్) = సంతుష్టుడై; ఆత్మానం = తన్ను; జగత్-గురోః = లోకజనకుడైన విష్ణువుయొక్క; గురుత్వేన = జనకత్వముచేత; పరార్ధ్యం = సర్వోత్కృష్టునిగా; మేనే = తలంచెను.

తాత్పర్యము : అనంతరము దశరథుడు రాణులవలన ఆ విధములైన స్వప్నములను విని సంతుష్టుడై తన్ను జగత్పితయొక్క పితృత్వముచేత సర్వోత్కృష్టునిగా భావించుకొనెను.

వ్యాఖ్యానము : ఈ విధములైన స్వప్నములు రాణులు చెప్పగా విని దశరథుడు శ్రీమన్నారాయణుడే తనకు పుత్రరూపమున జన్మింపబోవుచున్నాడని గ్రహించెను. సర్వజగత్తులకు జనకుడైన పరమపురుషునకు తాను జనకుడగుచున్నాడు. తన భాగ్య మేమనవచ్చును? దశరథుడు తన జన్మ ధన్యమైనదని యుప్పొంగిపోయెను.

శ్లో॥ విభక్తాత్మా విభు స్తాసా
మేకః కుక్షిష్వనేకధా
ఉవాస ప్రతిమాచంద్రః
ప్రసన్నానా మపా మివ. 66

పద విభాగము : విభక్తాత్మా, విభుః, తాసాం, ఏకః, కుక్షిషు, అనేకధా, ఉవాస, ప్రతిమాచంద్రః, ప్రసన్నానాం అపాం ఇవ.

అన్వయము : ఏకః విభుః తాసాం కుక్షిషు ప్రసన్నానాం అపాం కుక్షిషు ప్రతిమాచంద్ర ఇవ అనేకధా విభక్తాత్మా (సన్) ఉవాస.

అర్థము : ఏకః = ఏకరూపుడైన; విభుః = విష్ణువు; తాసాం = ఆ రాణుల యొక్క; కుక్షిషు = ఉదరములందు; ప్రసన్నానాం = ప్రసన్నములైన; అపాం =

జలములయొక్క; కుక్షిషు = ఉదరములందు; ప్రతిమాచంద్ర + ఇవ = ప్రతి ఫలించిన చంద్రునివలె; అనేకథా = పెక్కు తీరుల; విభక్తాత్మా = విభజింపబడిన రూపము గలవాడై; ఉవాస = వసించెను.

తాత్పర్యము : ఏకరూపుడైన విష్ణువు ఆ రాణులయొక్క ఉదరములందు, ప్రసన్నములయిన జలముల యుదరములందు ప్రతిబింబమైన చంద్రునివలె పెక్కు తీరుల విభజింపబడిన రూపము గలవాడై యుండెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పాయసాన్నము నాలుగు భాగములైనంత దాని నాశ్ర యించి యుండిన వైష్ణవ తేజముకూడ నాలుగు భాగములయ్యెను. అందొక భాగము కౌసల్య యుదరమున, ఒకటి కైకేయి యుదరమున, రెండు సుమిత్ర యుదరమున నున్నవి. వైష్ణవ తేజము ఏకము, అవిభాజ్యము. అది విభక్తమైనట్లు కనబడును గాని నిజముగా విభక్తము కాదు. నిజమైన చంద్రుడు ఒక్కడే. పెక్కుగా నగ పడునవి ప్రతిమా చంద్రబింబములు - చంద్రబింబ ప్రతిబింబములు. ఒక్కొక్క జలాశయమున ఒక్కొక్క చంద్రబింబము గోచరించినట్లు ఒక్కొక్క రాణి గర్భాశయమున ఒక్కొక్క విష్ణువు గోచరించుచుండెను.

"ప్రసన్నానాం అపాం కుక్షిషు" అన్నప్పుడు భిన్న జలాశయముల కుక్షు లందు భిన్నమై తోచు చంద్రబింబమును ఉపమానముగా గ్రహించుట ఉచితము. వేర్వేరు రాణుల గర్భాశయములందు ఒకే విష్ణువు వేరువేరుగా నుండెనను ప్రకృ తాంశమునకు ఉపమానము చక్కగా పొసగి యుండును. వాయు కంపితమైన జల మున భిన్నముగా దోచు చంద్రబింబమును ఉపమానముగా మల్లినాథ సూరి నిరూ పించుట యందలి సామంజస్యము చింత్యము.

శ్లో॥ అథాగ్ర్యమహిషీ రాజ్ఞః
ప్రసూతి సమయే సతీ
పుత్రం తమోఽపహం లేభే
నక్తం జ్యోతి రివౌషధిః. 67

పద విభాగము : అథ, అగ్ర్యమహిషీ, రాజ్ఞః, ప్రసూతి సమయే, సతీ, పుత్రం, తమోఽపహం, లేభే, నక్తం, జ్యోతిః, ఇవ, ఓషధిః.

అన్వయము : అథ రాజ్ఞః అగ్ర్యమహిషీ సతీ ప్రసూతి సమయే తమోఽపహం పుత్రం నక్తం ఓషధిః (తమోఽపహం) జ్యోతిః ఇవ లేభే.

అర్థము : అథ = అనంతరము; రాజ్ఞః = దశరథునియొక్క; అగ్ర్య-మహిషీ = పెద్దరాణియు; సతీ = పతివ్రతయునైన కౌసల్య; ప్రసూతి-సమయే = ప్రసవించుటకు యోగ్యమైన కాలమున; తమస్ + అపహం = తమోగుణమును (దుఃఖమును) పోగొట్టు; పుత్రం = పుత్రుని; నక్తం = రాత్రివేళ; ఓషధిః = తృణజ్యోతి; తమోఽపహం = అంధకారమును పోగొట్టు; జ్యోతిః-ఇవ = జ్యోతినివలె; లేభే = పొందెను, కనెను.

తాత్పర్యము : అనంతరము దశరథుని యగ్ర మహిషియు, పతివ్రతయునైన కౌసల్య ప్రసవ యోగ్యమైన కాలమున తమోగుణమును నశింపజేయు పుత్రుని, రాత్రివేళ తృణజ్యోతి చీకటిని బోగొట్టు జ్యోతిని పొందినట్లు పొందెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : దశమ మాసమున కౌసల్య యొక పుత్రుని ప్రసవించెను. ఆతడు వైష్ణవ తేజము గనుక తమస్సును పోగొట్టువాడు. "సుతాభిధానం స జ్యోతిః సద్యః శోక తమోపహం" అనిన ద్వితీయ శ్లోక వాక్యము నిట అనుసంధించుకొన వలయును. తమస్సు (శోకము) అనెడు తమస్సు (చీకటి) అను తీరున నిచ్చట శ్లిష్ట రూపకము సాధ్యము. అది యుపమకు సహకారి. పున్నామ నరక దుఃఖము తొలగించువాడు గనుక పుత్రుడు తమోపహుండు-కనుక జ్యోతీ రూపుడు. ప్రసూతి సమయమనగా పదవ నెల. అప్పుడు కౌసల్య దుఃఖ నాశకుడగు శ్రీరాముని ప్రసవించుట రాత్రివేళ ఓషధి అంధకార నాశకమగు జ్యోతిని ప్రసవించి నట్లుండె ననుటచే ఉపమాలంకారము. కౌసల్య ఓషధి, శ్రీరాముడు జ్యోతి, దశమమాసము రాత్రి, అపుత్ర దుఃఖము చీకటి. రెండు వాక్యార్థములకు ఉపమానోపమేయ భావము గనుక వాక్యార్థోపమ. ఇట్టివి జయదేవుని మతమున స్తబకోపమలు.

శ్లో॥ రామ ఇత్యభిరామేణ
వపుషా తస్య చోదితః
నామధేయం గురుశ్చక్రే
జగత్ప్రథమ మంగళమ్. 68

పద విభాగము : రామః, ఇతి, అభిరామేణ, వపుషా, తస్య, చోదితః, నామధేయం, గురుః, చక్రే, జగత్ప్రథమ మంగళం.

అన్వయము : అభిరామేణ వపుషా చోదితః గురుః తస్య జగత్ప్రథమ మంగళం రామః ఇతి నామధేయం చక్రే.

అర్థము : అభిరామేణ = మనోహరమైన; వపుషా = శరీరముచేత; చోదితః = ప్రేరితుడైన; గురుః = తండ్రి; తస్య = ఆతనికి; జగత్ = లోకములకు; ప్రథమ = మొదటిదైన; మంగళం = శుభలక్షణమైన; రామః-ఇతి = రాముడు అను; నామధేయం = నామకరణము; చక్రే = చేసెను.

తాత్పర్యము : అభిరామమైన శరీరముచేత ప్రేరితుడైన తండ్రి ఆతనికి లోకములకు మొదటి శుభలక్షణమైన రాముడు అను నామకరణము చేసెను.

అలంకారము : నిరుక్తి.

వ్యాఖ్యానము : చూచువారి మనస్సులు తనయందే రమించునట్లు చేయునంత సుందరమైన కౌసల్యా నందనుని శరీరమును జూచి దశరథుడు అప్రయత్నముగా 'రామః' అని పలికెను. అదియే ఆ శిశువునకు నామ మయ్యెను. ఏ ముహూర్తమున దశరథుడు 'రామ' అన్న నామము నుచ్చరించెనో ! ఆ నామము సర్వ జగత్తులకు శుభకరములైన నామములలో అగ్రగణ్యమయ్యెను. దశరథుడు విష్ణువే తనకు పుత్రుడై జన్మింపబోవు చున్నాడని తన భార్యలు చెప్పిన స్వప్నములనుబట్టి నిశ్చయించుకొని యుండెను. అట్టివానికి విష్ణు నారాయణాది పదములలో నొకదానిని నామముగా ఉంచవలసినది. కాని దశరథుడు ప్రథమ దర్శనముననే జగదానందకరమైన పుత్రుని మూర్తి సౌందర్యముచే ప్రేరితుడై

అయత్నముగా 'రామః' అనెను. విష్ణువునకు సహస్రనామములు కలవు. కాని రామనామమునకు గల ప్రశస్తి ఏ నామమునకు లేదు.

"శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే
సహస్రనామతస్తుల్యం రామనామ వరాననే"

అను శ్లోకార్థము నిట స్మరింపవలెను.

శ్లో॥ రఘువంశ ప్రదీపేన
తేనా ప్రతిమతేజసా
రక్షాగృహగతా దీపాః
ప్రత్యాదిష్టా ఇవాభవన్. 69

పద విభాగము : రఘువంశ ప్రదీపేన, తేన, అ ప్రతిమతేజసా, రక్షాగృహ గతాః, దీపాః, ప్రత్యాదిష్టాః, ఇవ, అభవన్.

అన్వయము : రఘువంశ ప్రదీపేన అప్రతిమతేజసా తేన రక్షాగృహగతాః దీపాః ప్రత్యాదిష్టాః ఇవ అభవన్.

అర్థము : రఘువంశ = రఘువంశమునకు; ప్రదీపేన = దీపము వంటి వాడైన; అప్రతిమ-తేజసా = సాటిలేని తేజము గల; తేన = ఆ శ్రీరామునిచేత; రక్షా-గృహ-గతాః = ప్రసూతి గృహమందున్న; దీపాః = దీపములు; ప్రత్యాదిష్టాః + ఇవ = తిరస్కరింపబడినవా యన్నట్లు; అభవన్ = ఆయెను.

తాత్పర్యము : రఘువంశమునకు దీపమువంటివాడైన సాటిలేని తేజస్సు గల ఆ రామచంద్రునిచే ప్రసూతి గృహమందున్న దీపములు తిరస్కరింపబడినవా యన్నట్లుండెను.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : రఘువంశ మహారాజులను సూర్యునితో, అగ్నితో, దీపముతో పోల్చుట కాళిదాసునకు పరిపాటి. సూర్యునివల్ల ప్రవర్తిల్లిన వంశమందలి మహాపురుషులకు ఇట్టి పోలికలు పరమోచితములు. శ్రీరాముడు రఘువంశమునకు

ప్రదీపము. దశరథునివలె చిరకాలము జీవించినవారు, అపుత్రులై యున్నవారు, రఘువంశమున లేరు. ఆయనకు సంతతి కలుగనంతవరకు రఘువంశము అపుత్రతా దుఃఖాంధకారమగ్నమై యుండెను. ఇప్పుడు శ్రీరాముడు జన్మించి, రఘువంశమును వెలిగించెను. రఘువంశ రాజులెల్ల గొప్పవారైనను శ్రీరాముడు జన్మింపకుండినచో ఆ వంశమున కింత ప్రశస్తి వచ్చియుండెడిది కాదు. రాముడు జన్మించి రఘువంశమును సర్వలోకములందు, సర్వకాలములందు ప్రకాశించునట్లు చేసెను. కనుకనే శ్రీరాముడు రఘువంశ ప్రదీపుడు. సాక్షాద్విష్ణుతేజము గనుక శ్రీరాముని తేజస్సు అప్రతిమము. సూర్యమండల మధ్యవర్తియైన శ్రీమన్నారాయణుడే శ్రీరాముడు. అతని తేజము నెదుట అన్యతేజములు సూర్యుని యెదుట దివిటీలవలె వెలవెల బోవును. తేజోమూర్తియైన శ్రీరాముడు జన్మింపగనే ప్రసూతి గృహమందలి దీపములన్నియు వెలవెల బారెను.

"ప్రత్యాదిష్టా ఇవా భవన్" – తిరస్కృతములయ్యెనా యన్నట్లుండెను అనుట కావ్యదృష్టిలో ఉత్ప్రేక్షాలంకారము – అనగా కేవలము భావన. శాస్త్ర దృష్టిలో ఇది కేవల సత్యము. సత్యమునే కాళిదాసు అలంకారరూపమున సుందరముగా ప్రతిపాదించెను. రఘు మహారాజు జన్మించినప్పుడు కూడ కాళిదాసిట్లే యుత్ప్రేక్షించెను –

"అరిష్ట శయ్యాం పరితో విసర్పిణా
సుజన్మన స్తస్య నిజేన తేజసా
నిశీథదీపాః సహసా హతత్విషో
బభూవు రాలేఖ్య సమర్పితా ఇవ." 3–15

నందినీధేనువు పయస్సు పానముచేయగా జన్మించిన రఘువు వంశకర్తయై కులదీపకుడయ్యెను. పాయసాన్న భక్షణము చేయగా జన్మించిన శ్రీరామచంద్రుడు జగన్మంగళ నాముడై రఘువంశమును ప్రదీపింపజేసెను. ఈ యిరువురి జననము లందును కాళిదాసు రమ్యమైన యుత్ప్రేక్షలు నిర్మించెను.

ఈ యుత్ప్రేక్షవలన శ్రీరాము డవతరించిన క్షణమందే రావణాదుల తేజస్సులు తిరస్కృతప్రాయము లయ్యెనని ధ్వనించును.

శ్లో॥ శయ్యాగతేన రామేణ
మాతా శాతోదరీ బభౌ
సైకతాంభోజ బలినా
జాహ్నవీవ శరత్కృశా. 70

పద విభాగము : శయ్యాగతేన, రామేణ, మాతా, శాతోదరీ, బభౌం సైకతాంభోజ బలినా, జాహ్నవీ, ఇవ, శరత్కృశా.

అన్వయము : శాతోదరీ మాతా శయ్యాగతేన రామేణ సైకతాంభోజ బలినా శరత్కృశా జాహ్నవీ ఇవ బభౌ.

అర్థము : శాత-ఉదరీ = చిక్కిన యుదరము గల; మాతా = తల్లియైన కౌసల్య; శయ్యా-గతేన = శయ్యయందున్న ; రామేణ = రామునిచే; సైకత = ఇసుకతిన్నె యందలి; అంభోజ = కమల మనెడు; బలినా = పుష్పోపహారముచే; శరత్-కృశా = శరదృతువునందు చిక్కిపోయిన; జాహ్నవీ-ఇవ = గంగానది వలె; బభౌ = ప్రకాశించెను.

తాత్పర్యము : కృశించిన యుదరము గల తల్లియైన కౌసల్య శయ్యాయ, దున్న శ్రీరామునిచే, సైకతమందున్న కమల పుష్పోపహారముచే శరత్తున కృశించి యున్న గంగానది ప్రకాశించినట్లు ప్రకాశించెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ఉదరస్థుడైన శిశువు బహిర్గతుడైనంతనే కౌసల్య యుద రము కృశమయ్యెను. అప్పు డామె శాతోదరి. జన్మించిన శిశువు ఆమె ప్రక్కనే యుండెను. ఆ సన్నివేశము శరదృతువున కృశించిన గంగానది యొడ్డునందలి ఇసుకతిన్నెపై కమల పుష్పోపహార మున్నట్లు ఉన్నది. కౌసల్యా గర్భమునుండి శ్రీరాముడు బహిర్గతుడైనంతనే నాభీనాళము ఖండింపబడి ఆతడు తల్లినుండి వేరై యామె ప్రక్కనే పరుండబెట్టబడి యుండెను. శరత్తున గంగానది కృశించును. అందు వికసించిన అంభోజములు నాళమునుండి త్రుంపబడి పూజార్థము తీర సికతా తలమున ఉంచబడును: పుష్పాద్యుపహారములచే అలంకృతమైన మూర్తికి శోభాతి

శయము కలుగుట సహజము. అంభోజ పుష్పోపహారముచే జాహ్నవి శోభిల్లినట్లు పుత్రోపహారముచే కౌసల్య శోభిల్లెను. కౌసల్య జాహ్నవి. ఆమెనుండి పుట్టిన రాముడు ఆ నదినుండి పుట్టిన అంభోజము. శయ్య సైకతము. రాముని నాభీ నాళము కమలనాళ మనుట గమ్యము.

సైకతౌపమ్యముచే శయ్యాచ్ఛద దావళ్యము, అంభోజ బల్యౌపమ్యముచే శ్రీరాముని సౌకుమార్యము, జాహ్నవ్యౌపమ్యముచే కౌసల్య నిర్మలత్వ పవిత్రత్వ ములు సూచింపబడుచున్నవి.

శ్లో॥ కైకేయ్యా స్తనయో జజ్ఞే
భరతో నామ శీలవాన్
జనయిత్రీ మలం చక్రే
యః ప్రశ్రయ ఇవ శ్రియమ్. 71

పద విభాగము : కైకేయ్యాః, తనయః, జజ్ఞే, భరతః, నామ, శీలవాన్, జనయిత్రీం, అలంచక్రే, యః, ప్రశ్రయః, ఇవ, శ్రియమ్.

అన్వయము : కైకేయ్యాః భరతః నామ శీలవాన్ తనయః జజ్ఞే; యః ప్రశ్రయః శ్రియం ఇవ జనయిత్రీం అలంచక్రే.

అర్థము : కైకేయ్యాః = కైకేయికి; భరతః-నామ = భరతుడు అను; శీలవాన్ = శీలవంతుడైన; తనయః = పుత్రుడు; జజ్ఞే = జన్మించెను; యః = ఎవ్వడు; ప్రశ్రయః = వినయము; శ్రియం-ఇవ = సంపదను వలె; జనయిత్రీం = తల్లిని; అలంచక్రే = అలంకరించెనో-

తాత్పర్యము : కైకేయికి భరతుడను శీలవంతుడైన కుమారుడు జన్మించెను. ఆతడు వినయము సంపదను వలె తల్లిని అలంకరించెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : పాయస ప్రదానమున నవలంబించిన క్రమమునే ప్రసూతి విషయమునను ఇచ్చట కాళిదాసు అవలంబించుచున్నాడు. కౌసల్య కిచ్చిన పిదప

కైకేయి కిచ్చినట్లు చెప్పెను గనుక శ్రీరాము జననానంతరము భరత జననము చెప్పుచున్నాడు. "శీలవాన్" అని భరతుని నిగ్రహమునకు ప్రాధాన్యమిచ్చి ఉపమానముచే ఆ నిగ్రహము విశేష రూపమున వినయము అని సూచించుచున్నాడు. వినయము సంపద నలంకరించినట్లు భరతుడు కైకేయి నలంకరించెను అని యుపమాలంకారము. సంపదవల్ల వినయము జనించి దానికి ఎనలేని శోభ చేకూర్చును. అట్లే భర్తృవాల్లభ్యమునకు ప్రతీకయైన కైకకు భరతుడు జన్మించి యామె భర్తృవాల్లభ్యమునకు శోభ కలిగించెను. కౌసల్యకు జన్మించిన శ్రీరామ చంద్రుని వలెనే కైకేయికి జన్మించిన భరతుడుకూడ నీలమేఘ శ్యాముడు, వినయమూర్తి, శీలవంతుడు. వాల్మీకి గూడ భరతుని జననకాలమందే 'సత్య పరాక్రమః' అని రాముని గూర్చి సాధారణముగా నుపయోగించు విశేషణము నుపయోగించెను. జననక్రమము విషయమున వాల్మీకియు శ్రీరాముని తరువాత భరతుడే జన్మించినట్లు వ్రాసెను.

శ్లో॥ సుతౌ లక్ష్మణ శత్రుఘ్నౌ
సుమిత్రా సుషువే యమౌ
సమ్యగాగమితా విద్యా
ప్రబోధ వినయావివ. 72

పద విభాగము : సుతౌ, లక్ష్మణ శత్రుఘ్నౌ, సుమిత్రా, సుషువే, యమౌ, సమ్యక్, ఆగమితా, విద్యా, ప్రబోధ వినయౌ, ఇవ.

అన్వయము : సుమిత్రా లక్ష్మణ శత్రుఘ్నౌ యమౌ సుతౌ సమ్యక్ ఆగమితా విద్యా ప్రబోధ వినయౌ ఇవ సుషువే.

అర్థము : సుమిత్రా = సుమిత్ర; లక్ష్మణ–శత్రుఘ్నౌ = లక్ష్మణుడు శత్రుఘ్నుడునను; యమౌ = కవలైన; సుతౌ = ఇరువురు పుత్రులను; సమ్యక్ = చక్కగా; ఆగమితా = అభ్యసింపబడిన; విద్యా = విద్య; ప్రబోధ–వినయౌ–ఇవ = జ్ఞానమును, సంయమమునువలె; సుషువే = ప్రసవించెను.

తాత్పర్యము : సుమిత్రాదేవి లక్ష్మణుడు, శత్రుఘ్నుడునను కవల కుమారులను, చక్కగా అభ్యసింపబడిన విద్య తత్వజ్ఞానమును, ఇంద్రియ జయమును వలె ప్రసవించెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : సుమిత్రకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అను కవలు జన్మించిరి. రెండు ఖండములుగా నొసగబడిన పాయసమువల్ల ఆమె రెండు గర్భములు ధరించి ఇరువురను ప్రసవించెను. చక్కగా అభ్యసించిన విద్య తత్వజ్ఞానమును, ఇంద్రియ జయమును ప్రసవించుట ఉపమానముగా నొసగబడినది. సుమిత్ర చక్కగా నభ్యసింపబడిన విద్య. లక్ష్మణుడు తత్వజ్ఞానము, శత్రుఘ్నుడు ఇంద్రియ జయము అని గ్రహింపవలెను.

శ్లో॥ నిర్దోష మభవ త్సర్వ
మావిష్కృత గుణం జగత్
అన్వగా దివ చ స్వర్గో
గాం గతం పురుషోత్తమమ్. 73

పద విభాగము : నిర్దోషం, అభవత్, సర్వం, ఆవిష్కృతగుణం, జగత్, అన్వగాత్, ఇవ, చ, స్వర్గః, గాం, గతం, పురుషోత్తమం.

అన్వయము : సర్వం జగత్ నిర్దోషం ఆవిష్కృత గుణం చ అభవత్; గాం గతం పురుషోత్తమం స్వర్గః అన్వగాత్ ఇవ.

అర్థము : సర్వం = సమస్తమైన; జగత్ = లోకము; నిర్దోషం = దోష రహితము; ఆవిష్కృత-గుణం-చ = ప్రకటింపబడిన గుణములు గలదియు; అభవత్ = ఆయెను; గాం = భూమిని; గతం = పొందిన; పురుషోత్తమం = శ్రీమహావిష్ణువును; స్వర్గః = స్వర్గము; అన్వగాత్-ఇవ = అనుగమించెనా యన్నట్లుండెను.

తాత్పర్యము : సమస్త జగత్తును నిర్దోషము, ప్రకటిత గుణమును ఆయెను. భూమిని పొందిన పురుషోత్తముని స్వర్గముకూడ అనుగమించి వచ్చెనా యన్నట్లుండెను.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : విష్ణ్వంశముఁతో సకలగుణోపేతులై శ్రీరామాదు లవతరింపగా జగత్తున దోషములన్ని మాసిపోయి గుణములన్నియు ప్రకాశించెను. రావణునియందు అవగ్రహత్వము, విష్ణువునందు మేఘత్వము ఆరోపితమైన 49వ శ్లోకము ననుసంధించి ఇచ్చట దోషములనగా దుర్భిక్షాదులనియు, గుణములనగా ఆరోగ్యాదికమనియు గ్రహింపవలెను. నిర్దోషము గుణవంతమునైన మర్త్యము స్వర్గమేయగును. కనుక ఇచ్చట విష్ణువు మర్త్యలోక గతుడు కాగా స్వర్గము కూడ ఆయనవెంట భూలోకమునకు వచ్చెనా యన్నట్లున్నదని యుత్ప్రేక్షింపబడినది. స్వర్గము గుణవంతము, నిర్దోషమునని యాగమ ప్రసిద్ధము. దుఃఖస్పర్శ లేక సుఖమయమగుటయే స్వర్గ లక్షణము. పురుషోత్తముని యవతారమువల్ల భూమికి స్వర్గతుల్యత్వము సిద్ధించెనని భావము.

శ్లో॥ తస్యోదయే చతుర్మూర్తేః
పౌలస్త్య చకితేశ్వరాః
విరజస్కై ర్నభస్వద్భి
ర్దిశ ఉచ్ఛ్వసితా ఇవ. 74

పద విభాగము : తస్య, ఉదయే, చతుర్మూర్తేః, పౌలస్త్య చకితేశ్వరాః, విరజస్కైః, నభస్వద్భిః, దిశః, ఉచ్ఛ్వసితాః, ఇవ.

అన్వయము : చతుర్మూర్తేః తస్య ఉదయే పౌలస్త్య చకితేశ్వరాః దిశః విరజస్కైః నభస్వద్భిః ఉచ్ఛ్వసితాః ఇవ.

అర్థము : చతుర్మూర్తేః = నాలుగు మూర్తులు ధరించిన; తస్య = ఆ విష్ణువుయొక్క; ఉదయే (సతి) = జన్మము కలుగగా; పౌలస్త్య = రావణుని చేత; చకిత = భయపెట్టబడిన; ఈశ్వరాః = అధిపతులు గల; దిశః = దిక్కులు; విరజస్కైః = ధూళి లేని; నభస్వద్భిః = వాయువులచేత; ఉచ్ఛ్వసితాః-ఇవ = ఊర్పు విడిచినవా యన్నట్లు ఉండెను.

తాత్పర్యము : నాలుగు రూపములు ధరించిన పురుషోత్తముని యవతారము సంభవించినంతనే రావణునిచే ఉద్వేజితులైన పాలకులు గల దిక్కులు దుమ్ము లేని వాయువులచే ఊర్పు విడిచినవా యన్నట్లుండెను.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : ఒకే విష్ణువు నాల్గు మూర్తులు ధరించెనని వెనుక చెప్ప బడినది. చతుర్మూర్తియై పురుషోత్తము డుదయించినంత దిక్కులన్నియు ప్రసన్నములైనవి. ఇంతవఱకు దిగీశ్వరులు రావణ భీతులై యుండుటచే దిశలు ప్రాణములు బిగబట్టుకొని యుండెను. ఇప్పుడు ఇంద్రాదులను రక్షించుటకై పురుషోత్తముడు చతుర్మూర్తియై యవతరించెను గనుక చతుర్దిశలు తమ పతులకు భయము తీరినదని యూరడిల్లి నిట్టూర్చినట్లున్నవని యుత్ప్రేక్ష.

"దిశః ప్రసేదు ర్మరుతో వవు స్సుఖాః" అని తృతీయ సర్గమున రఘువు జన్మించిన సమయమునను కాళిదాసిట్లే వర్ణించెను. ఇచ్చట ఆ వర్ణనయందు ఉత్ప్రేక్షను గూడ రూపించెను. దిక్కులు ప్రసన్నములై సుఖవాయువులు ప్రసరించుట తమ పతులకు రావణ భీతి తొలగినది గదా యని దిశలు ధూళి రహితములైన వాయువుల రూపమున నిట్టూర్పు విడుచుటగా ఉత్ప్రేక్షింపబడినది.

శ్లో॥ కృశాను రపధూమత్వా
త్ప్రసన్నత్వా త్ప్రభాకరః
రక్షో విప్రకృతా వాస్తా
మపవిద్ధ శుచా వివ. 75

పద విభాగము : కృశానుః, అపధూమత్వాత్, ప్రసన్నత్వాత్. ప్రభాకరః, రక్షో విప్రకృతౌ, ఆస్తాం, అపవిద్ధశుచౌ, ఇవ.

అన్వయము : రక్షో విప్రకృతౌ కృశానుః ప్రభాకరః (చ) అపధూమత్వాత్ ప్రసన్నత్వాత్ (చ) అపవిద్ధ శుచౌ ఇవ ఆస్తాం.

అర్థము : రక్షస్ = రావణునిచే; విప్రకృతౌ = పరాజితులైన; కృశానుః = అగ్ని; ప్రభాకరః-చ = సూర్యుడును; అపధూమత్వాత్ = ధూమము తొలగినందువలన; ప్రసన్నత్వాత్-చ = నిర్మలత్వమువలనను; అపవిద్ధ-శుచౌ-ఇవ = తొలగిన శోకము గలవారా యన్నట్లు; ఆస్తాం = అయిరి.

తాత్పర్యము : రావణాసురునిచే పరాభూతులైన అగ్నియు, సూర్యుడును ధూమము తొలగిపోవుటవల్లను, నిర్మలత్వము కలిగినందువల్లను తొలగిపోయిన శోకము గలవారా యన్నట్లుండిరి.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : దిక్పాలకులే కాక అగ్ని, సూర్యాదులును రావణునిచే పరాభూతులై తేజములు కోల్పోయి యుండిరి. ఇప్పుడు వారికిగూడ అభయము లభించినది. ధూమము తొలగి అగ్నియు, మాలిన్యము తొలగి సూర్యుడును ప్రకాశించుట వారు పరాభవ శోకము తొలగి ప్రకాశించుటగా ఉత్ప్రేక్షింపబడినది. శ్రీరామాదుల జననమే సర్వభూతములకు అభయానందప్రదమయ్యెనని భావము.

శ్లో॥ దశానన కిరీటేభ్య
స్తత్క్షణం రాక్షసశ్రియః
మణివ్యాజేన పర్యస్తాః
పృథివ్యా మశ్రుబిందవః. 76

పద విభాగము : దశానన కిరీటేభ్యః, తత్ క్షణం, రాక్షసశ్రియః, మణివ్యాజేన, పర్యస్తాః, పృథివ్యాం, అశ్రుబిందవః.

అన్వయము : తత్ క్షణం రాక్షసశ్రియః అశ్రుబిందవః దశానన కిరీటేభ్యః మణివ్యాజేన పృథివ్యాం పర్యస్తాః.

అర్థము : తత్ క్షణం = శ్రీరాము డవతరించిన క్షణమునందే; రాక్షసశ్రియః = రాక్షస లక్ష్మియొక్క; అశ్రుబిందవః = కన్నీటిబొట్లు; దశానన = రావణునియొక్క; కిరీటేభ్యః = కిరీటములనుండి; మణివ్యాజేన = మణుల మిషచే; పృథివ్యాం = భూమియందు; పర్యస్తాః = జారిపడెను.

తాత్పర్యము : శ్రీరాము డుదయించిన క్షణమందే రాక్షసలక్ష్మియొక్క అశ్రుబిందువులు రావణుని కిరీటములనుండి మణులరూపమున నేలపై జారిపడెను.

అలంకారము : కైతవాపహ్నవాలంకారము.

వ్యాఖ్యానము : శ్రీరామచంద్రుడు దశరథునకే కాక సర్వ జగత్తునకును తమోఽపహుఁడే. కనుక ఆయన యవతారము సర్వజగత్తునకు అభయానందము సంధించెను. తరువాత జగద్భయంకరుడైన రావణునకు భయమును గూడ కలిగించెను. రాము డవతరించినంతనే దుర్నిమిత్తముగా రావణుని కిరీటమునుండి మణులు రాలి నేలపై బడెను. కాని మణివ్యాజమున రాక్షసలక్ష్మి యశ్రుబిందువులు రాలెననుటవల్ల రాలినవి మణులు కాదు, రాక్షసలక్ష్మి యశ్రుబిందువులు అను నర్థము ఏర్పడును. ఒక వస్తువున దాని ధర్మము నిషేధించి అన్యధర్మము నారోపించుట అపహ్నవాలంకార లక్షణము. మణులందు మణిత్వము నిషేధింపబడి అశ్రుత్వము ఆరోపింపబడినది. ఇచ్చట నిషేధము వాచ్యముగా లేక వ్యాజ శబ్దముచే సూచింపబడినది గనుక ఇది కైతవాపహ్నవాలంకారము.

"కైతవాపహ్నుతిర్వ్యక్తే వ్యాజాద్యై ర్నిహ్నవే పదైః"

— చంద్రాలోకము.

శ్లో॥ పుత్రజన్మ ప్రవేశ్యానాం
తూర్యాణాం తస్య పుత్రిణః
ఆరంభం ప్రథమం చక్రు
ర్దేవదుందుభయో దివి. 77

పద విభాగము : పుత్రజన్మ ప్రవేశ్యానాం, తూర్యాణాం, తస్య, పుత్రిణః, ఆరంభం, ప్రథమం, చక్రుః, దేవదుందుభయః, దివి.

అన్వయము : పుత్రిణః తస్య పుత్రజన్మ ప్రవేశ్యానాం తూర్యాణాం ఆరంభం దివి దేవదుందుభయః ప్రథమం చక్రుః.

అర్థము : పుత్రిణః = పుత్రవంతుడైన; తస్య = ఆ దశరథునియొక్క; పుత్ర = పుత్రులయొక్క; జన్మ = జన్మ సమయమున; ప్రవేశ్యానాం = మ్రోగింపదగిన; తూర్యాణాం = వాద్యములయొక్క; ఆరంభం = ఉపక్రమమును; దివి = స్వర్గమున; దేవ-దుందుభయః = దేవతల దుందుభులు; ప్రథమం = ముందుగా; చక్రుః = చేసెను.

తాత్పర్యము : పుత్రవంతుడైన యా దశరథమహారాజుయొక్క పుత్రజనన సందర్భమున మ్రోయింపదగిన వాద్యముల ప్రారంభమును స్వర్గమున దేవదుందుభులే ముందుగా చేసెను.

వ్యాఖ్యానము : మహారాజులకు పుత్రుడు జన్మించినప్పుడు ఆ శుభవార్తను లోకులకు ప్రకటించు నిమిత్తము మంగళ తూర్యములు మ్రోగింపబడును. దశరథ మహారాజునకు లేక లేక పుత్రులు జన్మించిరి. పుత్రజన్మోత్సవ మంగళతూర్యములు మ్రోగింపవలసి యున్నది. ఇంతలో ఆకాశమున దేవదుందుభి ధ్వనులు వినబడెను. దశరథుని పుత్రులు కేవలము రాజపుత్రులే కాదు-సాక్షాద్విష్ణుదేవుని యంశములు. దశరథుని అపుత్రత్వ దుఃఖము తీర్చుటకు మాత్రమే వారు జన్మింపలేదు. రావణ పీడితములైన సర్వలోకముల దుఃఖమును తీర్చుటకు జన్మించిరి. వారు జన్మింతురని ముందే యెఱింగియున్న దేవతలు దశరథుడు మంగళతూర్యములు మ్రోయించుటకు ముందే తాము దివమునందుండి దుందుభులు మ్రోయించి తమ యానందమును ప్రకటించిరి. ఆ దుందుభి ధ్వనులకు ప్రతిధ్వనులా యన్నట్లు అయోధ్యలో మంగళతూర్యములు మ్రోసెనని భావము

శ్లో॥ సంతానకమయీ వృష్టి
ర్భవనే తస్య పేతుషీ
సన్మంగళోపచారాణాం
సైవాది రచనాఽభవత్. 78

పద విభాగము : సంతానకమయీ, వృష్టిః, భవనే, తస్య, పేతుషీ, సన్మంగళోపచారాణాం, సా, ఏవ, ఆదిరచనా, అభవత్.

అన్వయము : తస్య భవనే సంతానకమయీ వృష్టిః పేతుషీ; సా ఏవ సన్మంగళోపచారాణాం ఆదిరచనా అభవత్.

అర్థము : తస్య = ఆ మహారాజుయొక్క; భవనే = మందిరమున; సంతానకమయీ = కల్పవృక్ష కుసుమరూపమైన; వృష్టిః = వర్షము; పేతుషీ = పడినదయ్యెను; సా + ఏవ = అదియే; సన్మంగళ + ఉపచారాణాం = సజ్జనులు

చేయు శోభనములైన యుపచారములకు; ఆదిరచనా = తొలి కార్యము; అభవత్ = ఆయెను.

తాత్పర్యము : ఆ దశరథమహారాజు భవనమున కల్పవృక్ష పుష్పరూప మైన వర్షము పడినదయ్యెను. ఆ వర్షమే సజ్జనులు చేయు మంగళోపచారములకు ప్రథమ క్రియ యయ్యెను.

వ్యాఖ్యానము : దేవదుందుభులు భూలోకమందంతటను శబ్దించెను. కాని కల్పవృక్ష కుసుమవర్షము అయోధ్యయందలి దశరథుని యంతఃపురమునమాత్రమే కురిసెను. ఆదిపురుషుడు మూర్తిచతుష్టయ రూపమున నవతరించి యుండినది అంతఃపురమునందే కదా. అందువల్ల ఆ దేవునకు ఉపహారముగా నుద్దేశింపబడిన పుష్పవర్షము ప్రసూతి గృహములున్న యంతఃపురమునందే కురిసెను. అయోధ్య యందలి సత్పురుషులు చేయబూనిన మంగళోపచారములకు ఆ సంతానక పుష్ప వర్షమే తొలిచర్య యయ్యెను. ఇట్లు దుందుభిధ్వాన పుష్పవర్షములచే దేవతలు భగవంతు డవతరించినందుకు తమ యానందోత్సాహములను ప్రకటించిరి. యథార్థ మునకు రావణునివల్ల మర్త్యులకంటె దేవతలకే యధికమైన పీడ సంభవించెను కనుక రావణ వధార్థము పరమపురుషుడు అవతరించుట మానవులకంటె దేవత లకే అధికముగా ఆనందోత్సాహ కారణమయ్యెనని భావము.

శ్లో॥ కుమారాః కృత సంస్కారా
స్తే ధాత్రీ స్తన్య పాయినః
ఆనందే నాగ్రజే నేవ
సమం వవృధిరే పితుః. 79

పద విభాగము : కుమారాః, కృతసంస్కారాః, తే, ధాత్రీ స్తన్యపాయినః, ఆనందేన, అగ్రజేన, ఇవ, సమం, వవృధిరే, పితుః.

అన్వయము : కృత సంస్కారాః ధాత్రీ స్తన్యపాయినః తే కుమారాః అగ్రజేన ఇవ పితుః ఆనందేన సమం వవృధిరే.

అర్థము : కృత-సంస్కారాః = చేయబడిన జాతకర్మాది సంస్కారములు గలవారును; ధాత్రీ = దాదులయొక్క; స్తన్య-పాయినః = పాలను త్రాగుచున్న

వారును నైన; తే-కుమారాః = ఆ రాజకుమారులు; అగ్రజేన-ఇవ = ముందే పుట్టినదా యన్నట్లున్న; పితుః = తండ్రియొక్క; ఆనందేన-సమం = ఆనందముతో పాటుగా; వవృధిరే = వృద్ధి పొందిరి.

తాత్పర్యము : చేయబడిన జాతకర్మాది సంస్కారములు గలవారును, ఉపమాతల స్తన్యములను గ్రోలుచున్నవారును అగు ఆ రాజకుమారులు తమకంటె ముందే పుట్టినదా యన్నట్లున్న తండ్రియొక్క ఆనందముతోపాటు వర్ధిల్లిరి.

అలంకారము : ఉత్ప్రేక్ష, సహోక్తి.

వ్యాఖ్యానము : ప్రాజాపత్య పురుషుడు పాయసమిచ్చినప్పుడే దశరథునకు పుత్రులు జన్మించుట నిశ్చితమైనది. కనుక పుత్రులు పుట్టకముందే దశరథునకు పుత్రజన్మానందము పుట్టెను. ఇందువల్ల దశరథుని యానందము ఆయన పుత్రుల కంటె వయస్సున పెద్దది. వారికి అగ్రజుడా యన్నట్లుది. పుత్రులు పెరుగుచున్న కొలది దశరథుని యానందమును పెరుగుచుండెను. ఆనందాభివృద్ధి, పుత్రాభివృద్ధి ఏకకాలమున సహభావముతో జరుగుచున్నట్లు చెప్పబడినది. పుత్రజన్మకంటె ముందే పుట్టిన యానందము ఆ పుత్రులకు అగ్రజన్ముడుగా సంభావింపబడుటచే ఉత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్ష ఆనందముతో సహా పుత్రులు వర్ధిల్లిరి అన్న సహోక్తికి బలము కలిగించుచున్నది. కనుక ఇందు ఉత్ప్రేక్షానుప్రాణితమైన సహోక్తి కలదని భావింపవలెను.

జాతకర్మ, నామకరణ, చౌల, ఉపనయన, వివాహములు సంస్కారములు. వీనిలో శ్రీరామాదులకు మొదటి రెండు సంస్కారములు జరిగినవి.

శ్లో॥ స్వాభావికం వినీతత్వం
తేషాం వినయకర్మణా
ముమూర్ఛ సహజం తేజో
హవిషేవ హవిర్భుజామ్. 80

పద విభాగము : స్వాభావికం, వినీతత్వం, తేషాం, వినయకర్మణా, ముమూర్ఛ, సహజం, తేజః, హవిషా, ఇవ, హవిర్భుజామ్.

అన్వయము : తేషాం స్వాభావికం వినీతత్వం వినయ కర్మణా హవిర్భుజాం సహజం తేజః హవిషా ఇవ ముమూర్ఛ.

అర్థము : తేషాం = ఆ రాజకుమారులయొక్క; స్వాభావికం = సహజమైన; వినీతత్వం = సాధువర్తనము; వినయ కర్మణా = శిక్షణచేత; హవిర్భుజాం = అగ్నులయొక్క; సహజం = స్వాభావికమైన; తేజః = తేజస్సు; హవిషా-ఇవ = ఆజ్యాది ద్రవ్యముచేత వలె; ముమూర్ఛ = వృద్ధిపొందెను.

తాత్పర్యము : ఆ రాజకుమారులయొక్క సహజమైన వినీతత్వము శిక్షణచేత, అగ్నులయొక్క స్వాభావికమైన తేజస్సు ఆజ్యాది ద్రవ్యముచేతవలె వృద్ధిపొందెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : విష్ణ్వంశ సంభూతులైన శ్రీరామాదులు జన్మచేతనే వినీతులు-మనోవాక్కాయ కర్మలందు నిగ్రహముగలవారు. ఆచార్యుల శిక్షవల్ల వారి సహజ వినయము వృద్ధిపొందెను. అగ్నియొక్క సహజ తేజము ఆజ్యాది హవిస్సులచే వృద్ధిపొందుట ఉపమానముగా గ్రహింపబడినది. సూర్యవంశ కుమారులకు ఉపమానముగా అగ్నిని గ్రహించుట సరసముగా నున్నది. అగ్నిని హవిర్భుక్ శబ్దముచే నిర్దేశించి, ఆతని తేజము హవిస్సుచే వృద్ధిపొందుననుటయు మిక్కిలి యుచితముగా నున్నది. హవిర్భోక్తకు హవిర్భోజనము పుష్టికరమగుట సహజముగదా.

శ్లో॥ పరస్పరా విరుద్ధాస్తే
తద్రఘో రనఘం కులమ్
అల ముద్యోతయామాసు
ర్దేవారణ్య మివర్తవః. 81

పద విభాగము : పరస్పరావిరుద్ధాః, తే, తత్, రఘోః, అనఘం, కులం, అలం, ఉద్యోతయామాసుః, దేవారణ్యం, ఇవ, ఋతవః.

అన్వయము : పరస్పరావిరుద్ధాః తే తత్ రఘోః అనఘం కులం ఋతవః దేవారణ్యం ఇవ అలం ఉద్యోతయామాసుః.

అర్థము : పరస్పర = అన్యోన్యము; అవిరుద్ధాః = వైరములేని; తే = ఆ కుమారులు; తత్ = ప్రసిద్ధమైన; రఘోః = రఘువుయొక్క; కులం = వంశమును; ఋతవః = వసంతాదులైన ఋతువులు; దేవ + అరణ్యం + ఇవ = నందనవనమునువలె; అలం = మిక్కిలిగా; ఉద్యోతయామాసుః = ప్రకాశింపజేసిరి.

తాత్పర్యము : అన్యోన్యము విరోధములేని యా రాజకుమారులు ప్రసిద్ధమైన రఘువంశమును వసంతాది ఋతువులు నందనవనమునువలె అత్యంతము ప్రకాశింపజేసిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ఒకే విష్ణువు చతుర్ధావిభక్తుడగుటవల్ల నలుగురుగా జన్మించిన రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు అవిరుద్ధగుణశీలురగుట సహజము. సౌభ్రాత్ర గుణము నలువురియందును సమానముగానుండుటచే ప్రసిద్ధమైన రఘువంశము వారిచే అతిశయముగా ప్రకాశించెను. సౌభ్రాత్రములేని సోదరులు కులదూషకులగుదురు. ఏకోదరులు కాకయు సౌభ్రాత్రముగలవారు కుల భూషకులగుదురు. పరస్పర విరుద్ధములైన ఋతువులు మర్త్యలోకమున ఏక కాలమందు ఏక ప్రదేశమున ఉండవు. సర్వ ఋతువుల సహావస్థానము స్వర్గమందలి నందనవనమునందే సాధ్యమగును. శ్రీరామాదులు సౌభ్రాత్రముచే రఘువంశమును ప్రకాశింప జేయుటకు ఉపమానముగా సర్వర్తువులు సహావస్థానముచే నందనవనమును ప్రకాశింపజేయుట స్వీకరింపబడినది. దివ్యాంశ సంభవులైన శ్రీరామాదులవల్ల రఘువంశమునకు దివ్యశోభ కలిగినదని భావము.

ఎవనిశోభ వానిది. అందరి శోభలు కలిసి దశరథుని కులమునకు అపూర్వ శోభ నాపాదించెను.

శ్లో॥ సమానేఽపి చ సౌభ్రాత్రే
యథోభౌ రామలక్ష్మణౌ
తథా భరత శత్రుఘ్నౌ
ప్రీత్యా ద్వంద్వం బభూవతుః. 82

పద విభాగము : సమానే, అపి, చ, సౌభ్రాత్రే, యథా, ఉభౌ, రామ లక్ష్మణౌ, తథా, భరత శత్రుఘ్నౌ, ప్రీత్యా, ద్వంద్వం, బభూవతుః.

అన్వయము : కించ సౌభ్రాత్రే సమానే అపి రామ లక్ష్మణౌ ఉభౌ తథా భరత శత్రుఘ్నౌ ప్రీత్యా ద్వంద్వం బభూవతుః.

అర్థము : కించ = మఱియును; సౌభ్రాత్రే = భ్రాతృప్రేమ; సమానే-అపి = తుల్యమైనదయినప్పటికిని; రామలక్ష్మణౌ = రామ లక్ష్మణులు; ఉభౌ = ఇరువురును; తథా = అట్లే; భరతశత్రుఘ్నౌ = భరత శత్రుఘ్నులు (ఉభౌ = ఇరువురును); ప్రీత్యా = స్నేహముచేత; ద్వంద్వం = జంట; బభూవతుః = అయిరి.

తాత్పర్యము : మఱియును భ్రాతృప్రేమ సమానమే యైనప్పటికిని రామ లక్ష్మణు లిరువురును, అట్లే భరత శత్రుఘ్ను లిరువురును జంటగా నయిరి.

వ్యాఖ్యానము : లోకుల దృష్టిలో రామ లక్ష్మణ భరత శత్రుఘ్ను లన్న బహుపద ద్వంద్వము, రామ లక్ష్మణులు, భరత శత్రుఘ్నులు అన్న ద్వంద్వములు ప్రసిద్ధములై యున్నవి. దీనికి కారణము కాళిదాసు సూచించుచున్నాడు. నలువురు పరస్పరము తుల్యమైన సౌభ్రాత్రము కలవారే యైనను హేతువు నిరూపింపరాని ప్రీతి యను ఒక భావముచేత ఆకర్షింపబడినవారై రామ లక్ష్మణులు ఒక ద్వంద్వముగను, భరత శత్రుఘ్నులు ఒక ద్వంద్వముగను ఏర్పడిరి. ఇట్లేర్పడుటకు ప్రీతి కారణమని కాళిదాసు. ఆ ప్రీతి ఆ జంటల మధ్యనే ఏల యుండవలెనన్న ప్రశ్నకు సమాధానము వారి జన్మలకు హేతువైన పాయస విభాగ విధానమే యని యూహింపదగును. కాళిదాసు రచన ననుసరించి దశరథుడు తమ కిచ్చిన పాయస భాగములలోనుండి కొంత కొంత భాగము కౌసల్య, కైకేయి సుమిత్ర కిచ్చిరి. అందు కౌసల్య యిచ్చిన భాగము లక్ష్మణుడుగాను, కైకేయి యిచ్చిన భాగము శత్రుఘ్నుడుగాను జన్మించినట్లు భావించినచో కౌసల్యా పుత్రుడైన రామునితో

ఆమె యిచ్చిన పాయస భాగమైన లక్ష్మణుడును, కైకేయీ పుత్రుడైన భరతునితో ఆమె యిచ్చిన పాయస భాగమైన శత్రుఘ్నుడును ద్వంద్వముగా నేర్పడిరని నిశ్చయింపవచ్చును.

ఆదిశేషుడు లక్ష్మణుడుగా, శంఖ చక్రములు భరత శత్రుఘ్నులుగా నవతరించినట్లు చెప్పుదురు. ఈ విధముగా చూచినను ఆదిపురుషుడు, ఆయన సింహాసనమైన ఆదిశేషుడు ఒక జంట, ఆయన యాయుధములైన శంఖ చక్రము లొక జంటయైనట్లు భావింపవచ్చును.

శ్లో॥ తేషాం ద్వయో ర్ద్వయో రైక్యం
బిభిదే న కదాచన
యథా వాయు విభావస్వో
ర్యథా చంద్ర సముద్రయోః. 83

పద విభాగము : తేషాం, ద్వయోః, ద్వయోః, ఐక్యం, బిభిదే, న, కదాచన, యథా వాయువిభావస్వోః, యథా చంద్ర సముద్రయోః.

అన్వయము : తేషాం ద్వయోః ద్వయోః వాయు విభావస్వోః యథా, చంద్ర సముద్రయోః యథా ఐక్యం కదాచన న బిభిదే.

అర్థము : తేషాం = ఆ నలుగురిలో; ద్వయోః = ఇద్దరకు; ద్వయోః = ఇద్దరకు; వాయు విభావస్వోః-యథా = పవనాగ్నులకు వలె; చంద్ర సముద్రయోః-యథా = చంద్ర సముద్రులకు వలె; ఐక్యం = ఐకమత్యము; కదాచన = ఎన్నడును; న-బిభిదే = భేదిల్లలేదు.

తాత్పర్యము : ఆ నలుగురిలో రామలక్ష్మణు లిద్దరికి, భరత శత్రుఘ్ను లిద్దరికి పవనాగ్నులకు వలె, చంద్ర సముద్రులకు వలె ఐకమత్యము ఎన్నడును భేదిల్లలేదు.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : రామలక్ష్మణులు, భరత శత్రుఘ్నులు అని యేర్పడిన ఆ ద్వంద్వముల నడుమ భేదభావ మెన్నడును కలుగలేదు. దీనికి ఉపమానము

లుగా అనిలాగ్నులు, చంద్ర సముద్రులు గ్రహింపబడినారు. అనిలాగ్నుల సహకారిత్వము, చంద్ర సముద్రుల వృద్ధిహేతుత్వము ప్రసిద్ధము. రామలక్ష్మణుల పరస్పర సహకారిత్వము, భరత శత్రుఘ్నుల పరస్పరాభివృద్ధిహేతుత్వము ఈ యుపమానములవల్ల గమ్యమగుచున్నవి. వనవాసమందును రామ లక్ష్మణులు విడిపోలేదు. భరత శత్రుఘ్నులును విడిపోకుండ అయోధ్యయందే యుండిరి.

శ్లో॥ తే ప్రజానాం ప్రజానాథా
స్తేజసా ప్రశ్రయేణ చ
మనో జహ్రు ర్నిదాఘాంతే
శ్యామాభ్రా దివసా ఇవ. 84

పద విభాగము : తే, ప్రజానాం, ప్రజానాథాః, తేజసా, ప్రశ్రయేణ, చ, మనః, జహ్రుః, నిదాఘాంతే, శ్యామాభ్రాః, దివసాః, ఇవ.

అన్వయము : ప్రజానాథాః తే తేజసా ప్రశ్రయేణ చ నిదాఘాంతాః శ్యామాభ్రాః దివసాః ఇవ ప్రజానాం మనః జహ్రుః.

అర్థము : ప్రజానాథాః = ప్రభువులైన; తే = ఆ రాజకుమారులు; తేజసా = ప్రభావముచేతను; ప్రశ్రయేణ-చ = వినయముచేతను; నిదాఘ + అంతే = గ్రీష్మాంతమందు; శ్యామ + అభ్రాః = నీలిమబ్బులు గల; దివసాః + ఇవ = దినములు వలె; ప్రజానాం = ప్రజలయొక్క; మనః = మనస్సును; జహ్రుః = హరించిరి.

తాత్పర్యము : ప్రభువులైన యా రాజకుమారులు ప్రభావముచేతను, వినయముచేతను, గ్రీష్మాంతమున నీలిమబ్బులు గల దినములవలె ప్రజల మనస్సును హరించిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : రావణుడు 5వ శ్లోకమున నిదాఘముతో పోల్పబడుటయు, 49వ శ్లోకమున అవగ్రహముగా రూపింపబడుటయు నిట స్మరింపవలెను. దశరథపుత్రు లవతరించిన లనే రావణునకు అవసానకాలము సమీపించినది. కనుక

రావణ పీడితులైన ప్రజలకు నిదాఘము ముగియవచ్చినట్లనిపించినది. గ్రీష్మాంతమందే ఆకసమున మేఘశకలము లుదయించి ఎండ తీవ్రత తగ్గి జనములకు ఆహ్లాదము కలుగును. శ్రీరామాదులు ప్రజలకు ఆ విధముగా మనోహరులైరి. శ్రీరామాదులు శైశవము వీడి బాల్యము ప్రాపించి ప్రజలకు తరచు దర్శనమిచ్చుచు వారి హృదయములపై ప్రభుత్వము చేయసాగిరి. తేజస్సుచేతను, వినయము చేతను ఆ రాజకుమారులు గ్రీష్మాంతమందలి శ్యామాభ్ర దివసములవలె నుండిరనుటచే ఉపమాలంకారము. తేజస్సుచే గ్రీష్మ దివసములవలె దుర్నిరీక్ష్యులుగను, వినయముచే శ్యామాభ్ర దివసములవలె ఆహ్లాదకరులుగను ఉండిరని భావము. లేదా నిదాఘాంతమున శ్యామాభ్రములైన దివసములు సుఖసేవ్యములైనట్లు తేజో వినయ భూషితులైన రాజకుమారులు సుఖదర్శనులై యుండిరని భావము.

శ్లో॥ స చతుర్ధా బభౌ వ్యస్తః
ప్రసవః పృథివీపతేః
ధర్మార్థ కామ మోక్షాణా
మవతార ఇవాంగభాక్. 85

పద విభాగము : సః, చతుర్ధా, బభౌ, వ్యస్తః, ప్రసవః, పృథివీపతేః, ధర్మార్థ కామ మోక్షాణాం, అవతారః, ఇవ, అంగభాక్.

అన్వయము : చతుర్ధా వ్యస్తః పృథివీపతేః సః ప్రసవః అంగభాక్ ధర్మార్థ కామ మోక్షాణాం అవతారః ఇవ బభౌ.

అర్థము : చతుర్ధా = నాలుగు తీరులుగా; వ్యస్తః = విభజింపబడిన; పృథివీపతేః = దశరథరాజుయొక్క; సః-ప్రసవః = ఆ సంతానము; అంగభాక్ = ఆకారము గల; ధర్మార్థ కామ మోక్షాణాం = చతుర్విధ పురుషార్థములయొక్క; అవతారః-ఇవ = అవతారమువలె; బభౌ = ప్రకాశించెను.

తాత్పర్యము : నాలుగు తీరుల విభజింపబడిన దశరథమహారాజుయొక్క ఆ సంతానము మూర్తిమంతమైన ధర్మార్థ కామ మోక్షముల యవతారమా యన్నట్లు ప్రకాశించెను.

అలంకారము : ఉత్ప్రేక్ష.

వ్యాఖ్యానము : నాల్గు రూపములుగా విభక్తమై యున్న దశరథుని సంతానము కరచరణాద్యవయవములు ధరించి యవతరించిన ధర్మార్థ కామ మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థముగా భావింపబడుటచే ఉత్ప్రేక్ష. ఇట్టి పుత్రులచే సేవింపబడుచున్న దశరథునకు సర్వ పురుషార్థములును సిద్ధించినంత యానందము కలిగెనని వ్యంగ్యము.

శ్లో॥ గుణై రారాధయామాసు
స్తే గురుం గురువత్సలాః
తమేవ చతురంతేశం
రత్నైరివ మహార్ణవాః. 86

పద విభాగము : గుణైః, ఆరాధయామాసుః, తే, గురుం, గురువత్సలాః, తం, ఏవ, చతురంతేశం, రత్నైః, ఇవ, మహార్ణవాః.

అన్వయము : గురు వత్సలాః తే గుణైః గురుం చతురంతేశం తం ఏవ మహార్ణవాః రత్నైః ఇవ ఆరాధయామాసుః.

అర్థము : గురు-వత్సలాః = తండ్రియందు భక్తిగల; తే = ఆ రాజ కుమారులు; గుణైః = వినయాది గుణములచే; గురుం = తండ్రిని; చతురంత + ఈశం = నాల్గు దిక్కులకు ప్రభువైన; తం-ఏవ = ఆయననే (దశరథునే); మహార్ణవాః = మహాసముద్రములు; రత్నైః + ఇవ = రత్నములచేత వలె; ఆరాధయామాసుః = సంతోషపెట్టిరి.

తాత్పర్యము : పితృభక్తులయిన యా రాజకుమారులు వినయాది గుణములచే, చతుర్దిగంత పాలకుడైన ఆయననే మహాసముద్రములు రత్నములచేత వలె సంతోష పెట్టిరి.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : చతుస్సముద్ర ముద్రితయైన భూమికి ప్రభువైన దశరథ మహారాజును చతుస్సముద్రములను తమయందలి రత్నములచే ఆరాధించు చుండెను. అట్లే పితృభక్తులైన నలువురు పుత్రులు తమయందలి వినయాదులైన

గుణములచే ఆనంద పెట్టుచుండిరి. నలువురు పుత్రులు నాల్గు సముద్రములు, వారియందలి గుణములు రత్నములు.

శ్లో॥ సురగజ ఇవ దంతై ర్భగ్న దైత్యాసి ధారై
ర్నయ ఇవ ఫలబంధ వ్యక్తయోగై రుపాయైః
హరి రివ యుగదీర్ఘై ర్దోర్భి రంశై స్తదీయైః
పతి రవనిపతీనాం తైశ్చకాశే చతుర్భిః. 87

పద విభాగము : సురగజః, ఇవ, దంతైః, భగ్నదైత్యాసి ధారైః, నయః, ఇవ, ఫలబంధవ్యక్తయోగైః, ఉపాయైః, హరిః, ఇవ, యుగదీర్ఘైః, దోర్భిః, అంశైః, తదీయైః, పతిః, అవనిపతీనాం, తైః, చకాశే, చతుర్భిః.

అన్వయము : భగ్నదైత్యాసిధారైః దంతైః సురగజః ఇవ, ఫలబంధ వ్యక్తయోగైః ఉపాయైః నయః ఇవ, యుగదీర్ఘైః దోర్భిః హరిః ఇవ, తదీయైః అంశైః చతుర్భిః తైః అవనిపతీనాం పతిః చకాశే.

అర్థము : భగ్న-దైత్య+అసిధారైః = భంగము చేయబడిన రాక్షసుల యాయుధముల యంచులుగల; దంతైః = కోరలతోడి; సుర-గజః-ఇవ = ఐరావతమువలె; ఫల-బంధ = ఫలసిద్ధిచేత; వ్యక్త = స్పష్టపడిన; యోగైః = యుక్తులుగల; ఉపాయైః = సామాద్యుపాయములతోడి; నయః-ఇవ = నీతివలె; యుగ-దీర్ఘైః = బండి కాడివలె దీర్ఘములైన; దోర్భిః = చేతులతోడి; హరిః-ఇవ = విష్ణువువలె; తదీయైః = ఆ విష్ణుసంబంధులైన; అంశైః = అంశములైన; చతుర్భిః = నలుగురైన; తైః = ఆ కుమారులతో; అవని పతీనాం = రాజులకు; పతిః = ప్రభువైన దశరథుడు; చకాశే = ప్రకాశించెను.

తాత్పర్యము : భగ్నము చేయబడిన రాక్షసుల యాయుధ ధారలుగల దంతములతోడి యైరావతమువలె, ఫలసిద్ధిచే వ్యక్తమైన యోగముగల యుపాయములతోడి నీతివలె, బండి కాడివలె దీర్ఘములైన బాహువులతోడి విష్ణువువలె, ఆ విష్ణుని యంశములైన నలువురు కుమారులతో రాజాధిరాజైన దశరథుడు ప్రకాశించెను.

అలంకారము : ఉపమ.

వ్యాఖ్యానము : ఐరావతము నాలుగు దంతములు గలది. దైత్యుల ఖడ్గ ధారలు వానికి దగిలి భగ్నములై పోయినవి. సామ దాన భేద దండములను చతుర్విధోపాయములుగల నీతికి ఫలప్రాప్తి తథ్యము. విష్ణుదేవుని చతుర్బాహువులు జగద్రక్షణ భరణ సమర్థములు. విష్ణ్వంశ సంభూతులైన నలువురు కుమారులతో దశరథుడు చతుర్దంతములుగల యైరావతమువలె, చతురుపాయములుగల నీతివలె, చతుర్భుజములుగల విష్ణువువలె ప్రకాశించెనని యుపమాలంకారము. ఉపమేయమైన దశరథునకు మాలా రూపమున పెక్కు ఉపమానములు కూర్పబడుటచే ఇది మాలోపమాలంకారము.

ఇది మాలిని యను వృత్తము.

న న మ య య- గణములు. 8 అక్షరములపై విచ్ఛేదము.

మాలా రూపమున ఉపమానములు నిబంధింపబడిన ఈ వృత్తము మాలిని యగుట యొక ఛందశ్చమత్కారము.

రఘువంశ మహాకావ్యమున

దశమ సర్గము

'బాల సుధా' వ్యాఖ్యా సహితము సమాప్తము

ఇతి శివమ్.

# దశమసర్గమందలి చతురోక్తులు

1. అవ్యాక్షేపో భవిష్యంత్యాః కార్యసిద్ధేర్హి లక్షణమ్.

2. నానాత్వం రాగసంయోగాత్ స్ఫటికస్యేవ తే ధ్రువమ్.

3. సర్వప్రభు రనీశ స్త్వ మేక స్త్వం సర్వరూపభాక్.

4. స్వపతో జాగరూకస్య యాథార్థ్యం వేద కస్తవ?

5. గతిస్త్వం వీతరాగాణా మభూయస్సన్నివృత్తయే.

6. లోకానుగ్రహ ఏవైకో హేతుస్తే జన్మకర్మణోః.

7. స్వయ మేవ హి వాతోఽగ్నే స్సారథ్యం ప్రతిపద్యతే.

8. పుత్రం తమోఽపహం లేభే నక్తం జ్యోతిరివౌషధిః.

---

# మావద్ద లభించు ఇతర గ్రంథములు

---

1. ప్రాఙ్నన్నయ యుగము — 7-50

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని

2. నన్నయ భారతము — ,, — 10-00

3. ఆంధ్ర నాటక పితామహుడు — ,, — 3-50

4. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము — ,, — 3-50

5. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము — 15-00

శిరోమణి చలమచర్ల రంగాచార్యులు

6. అహోబల పండితీయము — 16-00

శ్రీ చలమచర్ల రంగాచార్యులు, శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ

7. తెలుగు జానపదగేయ సాహిత్యము — 15-00

డాక్టర్ బి. రామరాజు

8. నాట్యశాస్త్రము — 25-00

డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు

9. తెలుగు నాటక వికాసము — ,, — 20-00

10. సారస్వత నవనీతము — 6-00

శ్రీ దేవులపల్లి రామానుజరావు

11. భారతోపన్యాసములు — 5-00

12. వాఙ్మయ వ్యాసమంజరి — 8-00

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

13. రాగసుధ 1-50

శ్రీ కామఃవోలు వేంకటసుబ్బారావు

14. భారతము - ఛందః శిల్పము 20-00

డాక్టర్ పాటిబండ మాధవశర్మ

15. గిరిక పెండ్లి ,, 1-50

16. రఘువంశము (ఆంధ్ర టీకా సహిత) ,,

(1, 2, 3, 4, 5, 6 సర్గములు) ఒక్కొక్కటి 1-50

17. ఆధునికాంధ్ర కవిత్వము 20-00

డాక్టర్ సి. నారాయణరెడ్డి

18. వీర రసము 10-00

శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యము

19. సారస్వత సౌరభము ,, 4-50

20. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము 3-00

కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ

21. హర్ష చరిత్రము 1-3 ఉచ్ఛ్వాసములు (ఆంధ్ర టీక) 5-00

శ్రీ శలాక రఘునాథశర్మ, ఎం. ఏ.

22. కిరాతార్జునీయము 3-4 సర్గములు (ఆంధ్ర టీక) 3-00

23. మాళవికాగ్నిమిత్రము 'కరదీపికా' వ్యాఖ్యాన సహితము 6-50

24. దశకుమార చరిత్రము - పూర్వపీఠిక 4-00

ఆంధ్ర 'బాలసుధా' టీకా సహితము